# వక్రరేఖ



[చరిత్రాత్మక నవల]

గ్రంథకర్త
శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

పరిష్కరణకర్త
శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

REPRINTED

పబ్లిషర్సు
**సుందర రాం అండ్ సన్స్, తెనాలి.**

 1946 [వెల 1-0-0

# కృతజ్ఞత

నా ఈచిన్న పుస్తకమును రెండవముద్రణకు పరిష్కరించి సహాయపడిన శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి B.A.,B.ED., గారికి నేను కృతజ్ఞుడను.

---

Saradhi Press, Tenali.G. 95. For
Sundara Ram & Sons Q. H. G. 2. Copies 2000-28-7-46

# ప్రస్తావన

---

శ్రీమునిమాణిక్యం నరసింహారావుగారు నన్నీనవలరాజమునకుఁ బ్రస్తావనవ్రాయుమనుటకు అది రెండుపుటలకు మించరాదనుటకు క్రమముగా వారికి నామీఁదఁగల దయయు నిర్దయయుఁ గారణములు.

ఈ కావ్యముత్తమము. ఇది యుత్తమమగుటకు దీని యందలి మహోన్నతభావములే కారణము. ఉన్నతభావములకు తదుచితదివ్యభాషకు నవినాభావము. సమానభూయిష్ఠమనియో, కాదనియో, వాక్యములు చిన్నవనియో పెద్దవనియో, జాతీయము లున్నవనియో, లేవనియో, శయ్య సుకుమార మనియో, కాదనియో చెప్పుటకన్న సర్వము భావోచితమనుట యీ గ్రంథస్థభాషాశయ్యలకు సరియైన వ్యాఖ్యానము.

పాఠశాలలలోఁ జరిత్ర చదివింతురు. అది పిడిచేయుట. ఆచరిత్రయందలి దివ్యార్థములు విద్యార్థి బుద్ధి కెక్కనీయరు. ఆయుద్ధ మే సంవత్సరములో? ఈ సంధి యెప్పుడు? ఆ రాజెప్పుడు చచ్చెను? ఇవి చరిత్రలోని ప్రశ్నలు. ఇది విద్యార్థిని మందమతిగా నుంచుటకుఁ జేయు ప్రయత్నము. ఈకావ్యమున బహ్మనీరాజ్య మంతరించుటకైన కారణము, చరిత్రనుచూడ

వలసిన దృష్టితోఁ జూచి చిత్రించబడినది. ఇదిచరిత్ర చదువ వలసిన పద్ధతి. ఇట్లు చదువుటకు ప్రజ్ఞ కావలయును.

ఈ కావ్యమందలి శిల్పము మనోహరము. ఈకవి తెనుగు జీవితపు నిగ్గులు తెలిసినట్లు వ్రాయును. హరభట్టులక్షణజ్ఞానము నుండి లక్ష్యజ్ఞానము బయలువెడలుట విశిష్టమేధాసంకలితము.

ఇందుఁ బ్రతిమాటలోఁ బ్రతిపాత్రముతో సౌందర్యము తాండవించుచున్నది. కావ్యముపోనుపోను ప్రౌఢమగుచున్నది. ఆంధ్రమునందలి యత్యుత్తమమైన నవలలలో నిది యొకటి.

నిర్గుణము నిర్దోషమైన కావ్యమునుగూర్చి యేమియుఁ జెప్ప నలవికాదు కాని గుణబహుళమో దోషబహుళమో యైన కావ్యముంగూర్చి యెంతయేని జెప్పవచ్చును. గుణ బహుళమైన యీకావ్యగుణప్రశంస చేసిన మరల నింతగ్రంథము కావచ్చును. అందుచేత నియమితమైన రెండుపుటలకు దాటిపోవు నన్నభయముచేత నిది యింతలో సంక్షిప్తము.

బందరు
19–1–31

విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.,
లెక్చరరు : హిందూకాలేజీ

# ఒకటవ ప్రకరణము

సుమారాఱువేల యేండ్లక్రిందట 'భారతీయులకుఁ బవిత్రక్షేత్ర మయిన కాశీనగరమున, విద్వచ్ఛేఖరుఁడైన గంగూయను బ్రాహ్మణుడు నివసించుచుండెను. ఆయన పెద్దవాఁడై ఢిల్లీనగరమున కేగి, యచ్చట మహమ్మదీయ చక్రవర్తియొద్దఁ దన పాండిత్యమును బ్రదర్శించి మిక్కిలి పేరు గాంచెను. చక్రవర్తి గంగూబ్రాహ్మణునకుఁ జాల వసతి కల్పించి, ఢిల్లీనగరమందలి ధనవంతులలో నాయనను గూడ నొకనిగాఁ జేసెను. గంగూబ్రాహ్మణునకుఁ జక్రవర్తియొద్దనుంచి పలుకుబడికూడ కలదు.

గంగూయొద్ద హసన్ అనుపేరుగల మహమ్మదీయ సేవకుఁ డొకఁ డుండెను. వాఁడు చాలమేధావి. మంచిగుణవంతుఁడు. ఒకనాడు గంగూబ్రాహ్మణుని పొలములో హసన్ దున్నుచుండగా నొక బంగారపు బిందె కనంబడెను. హసన్ దానిని దెచ్చి తన యజమాని కప్పగించెను. గంగూ తన సేవకుని మంచితనమునకు సంతోషించి యతనిని మనసులో నాశీర్వదించెను. హసన్ వృద్ధిలోనికి రావలెనని యూహించుచుండెను.

గంగూ హసన్ హస్త మొకనాఁడు పరీక్షించి, యతని చక్రము వేసి యతఁడు రాజు కాఁదగిన చిహ్నము రెంటి

యందుఁ బోల్చి చూచుకొని, వాని కాసంగతి చెప్పి వాఁడు రాజైనప్పుడు తన్ను మరచిపోవలదనియుఁ దాను వానిని మఱచిపోననియుఁ జెప్పి, యట్లు పరస్పరము ప్రమాణవాక్యములచే బద్ధు లగునట్లు చేసెను.

గంగూ తన సేవకుని నొకనాఁడు చక్రవర్తియైన మహమ్మదుబీనతుగ్లాకునొద్దకుఁ దీసికొనిపోయి యతనిసద్గుణములు చెప్పి యేదైన యుద్యోగము వానికిఁ జేయుంచ ప్రార్థించెను. తుఘ్లుకు చాల దుర్మార్గుఁడు. మహాకోపి. అయినను దయ వచ్చినను నతని కఫారముగానే వచ్చును. స్వయముగా నతఁడు పండితుఁడు. పండితులయందుఁ జాల యభిమానము గలవాఁడు. స్వమతాభిమాని. కావున హాసన్ వెంటనే పెద్ద సేనానిగాఁ నయ్యెను.

అది మొదలు హాసన్ క్రమక్రమముగాఁ బెద్ద సేనానియై యనేక యుద్ధములయందు విజయలక్ష్మిని వరించి, బిరుదుమగం డయ్యెను. పోనుపోను తుఘ్లుకు విపరీతచర్యలు భరింపరాని వయ్యెను. అందుచేత దక్షిణాపథమును జయించుట కొకసారి వచ్చినప్పుడు కల్బరగిపట్టణము తాను స్వాధీనము చేసికొని స్వతంత్రుఁడై రాజయ్యెను. కానిబుద్ధిమంతుఁడగు హాసన్ కృతఘ్నుఁడు కాక చేసినవాగ్దానము మరచిపోవువాఁడుగాక, గంగూబ్రాహ్మణుని జ్ఞప్తియం దుంచుకొనెను. తనకుఁ బట్టిన సిరి యంతయు గంగూదయవలనఁ బట్టిన దనుకొనెను. అతఁడు తన పేరే హాసన్ గంగూ యని మార్చు

కొనెను. గంగూ బ్రాహ్మణుని బిలిపించి, యాతనిని తన బొక్కసమున కధికారిగా నిర్ణయించుకొనెను.

సాముద్రికము జ్యోతిషము శకునశాస్త్రము సమగ్రముగా నెఱింగి భూతభవిష్యద్వర్తమానము లెఱింగిన గంగూబ్రాహ్మణునియందు హసన్ రాజునకుఁగల విశ్వాసము, భక్తి మితిమీఱిపోయెను. హసన్ గంగూబ్రాహ్మణుని గూర్చి తన రాజ్యము, తన వంశము సర్వము నతని దయాధీనములని తలంచుచుండెను.

కాని హసన్ రాజ్యాధిపతియైనప్పటినుండియు హిందువులను బాధించుట మొదలయిన మహమ్మదీయ రాజులకు నలవాటయినకొన్ని కార్యములు చేయుచుండెను. ఇది గంగూబ్రాహ్మణునకిష్టములేదు. గంగూ తానొక యాలోచన చేసెను. తానును సుల్తానును కొన్ని నిబంధనలు చేసికొనునట్లును, వానివలన సుల్తానుగాని, వాని వంశమువారుగాని, బ్రాహ్మణులను జంపకుండునట్లును, గంగూ వంశస్థులు వంశ పరంపరగా హసన్ వంశపు సుల్తానులకు మిత్రులుగా నుండునట్లును, నిర్ణయము చేసి సుల్తాను నొప్పించెను. సుల్తాను వంశమువారీ నిబంధనల నతిక్రమించనంతవరకు గంగూ బ్రాహ్మణునిశక్తివంతమైనయాత్మ, యాసుల్తానులనురక్షించుచుండునని గంగూ తాను బ్రతికియుండియుఁ జచ్చియుఁ బ్రమాణము చేసెను. సుల్తాను నాటినుండి బ్రాహ్మణహింస మానెను.

ఈ వంశపు సుల్తానుల కానాటినుండియు బ్రాహ్మణ సుల్తానులని పేరు వచ్చెను. బ్రాహ్మణశబ్దము బహ్మనీగా మారి వారు బహ్మనీసుల్తానులైరి.

హాసన్ క్రీస్తుశకము 1347లో కలుబరగకిరాజయ్యెను. అతనితరువాతఁ దొమ్మిదవసుల్తానయిన యహమ్మదుషాయను నతఁడు రాజధానిని 1422 లో బీదరని పిలువఁబడు మహమ్మదాబాదునకు మార్చెను. రాజధాని మార్చి నలుబదియేండ్లు జరిగెను. అహమ్మదుషా తరువాతనల్లావుద్దీనును వానితరువాత హుమయూనును రాజ్యము చేసిరి. హుమయూను మహమ్మదు బీనతుఘ్లకువలెఁ బండితుఁడును క్రూరుఁడును పిచ్చివాఁడును నై యుండెను. ఈ హుమయూను దుర్మార్గపుఁబనుల కోర్వ లేక యతని భార్యచే యతని నంతఃపురమందు విసము పెట్టించి చంపిరి. హుమయూనున కిద్దరు కుమారులు. పెద్దవానిపేరు నైజాంషా రెండవవానిపేరు మహమ్మదుషా. అతఁడు పోవు నప్పటికి నైజాంషాకు ఎనిమిదేండ్లు. మహమ్మదుషాకు నేడేండ్లు.

హుమయూనునకు మహాసమర్థులగు నిద్దరు మంత్రులు కలరు. ఇందులో నొకఁడు ఖ్వాజామహమ్మదుగవాన్. ఇతఁడు గొప్ప సేనాని, మహామంత్రి అరువదియేండ్లు దాటినవాఁడు. ఇతని సాయమున హుమయూను జాలమంది పరరాజులను జయించి తనరాజ్యమును వృద్ధిచేసికొనెను. ఇతఁడిట్టివాఁడైనను హుమయూనున కితనిమీఁద కన్న రెండవవాఁడైన ఖాజా

జహాన్ మీద నెక్కువ దయయుండెడిది. అయినను తాను చనిపోవు నప్పుడు హుమయూను తన యొకయిదేండ్ల కొడుకును వీనిజనకును రాణికిని నప్పగించి నైజాంషాకు వయసు వచ్చువఱకు వీరు ముగ్గురును రాచకార్యములు చూచుచుండ వలయునని నియోగించి పోయెను. హుమయూన్ గతించి రెండేండ్లు కావచ్చినది.

రాణికి గవాన్ మీద నెక్కువ విశ్వాసము. ఇది జహాన్‌కు తెలియును, నైజాంషా. తల్లియైన రాణియుంగాను, గవాన్, నందును మిక్కిలి నమ్మకముగా వర్తించుచుండును. అందుచేత జహాన్ మహమ్మదుషాతో నెక్కువ పరిచయము కలిగి యుండును.

హసన్ గంగూనాటి నుండియు గంగూ బ్రాహ్మణుని వంశస్థు లీ సుల్తానులకు మిత్రులుగా నుండిరి. ఈ మైత్రి నామమాత్రముగానే మిగిలి యున్నది. హుమ యూను కాలములోనిది లేనే లేదని చెప్పవచ్చును. ఈనాటికి గంగూవంశస్థుడు హరశాస్త్రియనునతఁడు. ఇతఁడుగంగూవలె సర్వశాస్త్రములయందుఁ బ్రవీణుఁడని పేరుకలదు. సుల్తాను చిన్నవాఁడగుటచేత రాణియును గవాన్ మంత్రియు చిన్న సుల్తానునకు కాలము వెళ్లుటకుగాను హరశాస్త్రిని తోడు పర చిరి. నైజాంషాతో హరశాస్త్రి యందుచేత సామాన్యముగాఁ గలసి యుండును. రాణి యొకప్పుడు వారి నిద్దఱఁ జూచి వారిద్దరు హసన్ గంగూలు మరలఁ బుట్టిరని యనుకొనుచుం

డును. నిజమునకు హూసర్ గంగూలిప్రసు పోయిన తరువాత వారి షరతులు కాగితములమీదనే నిలచిపోయినవి. అప్పటి కిప్పుడీ నైజాంషా హరశాస్త్రులే యీ నిబంధనలు సంపూర్తిగా నెరవేర్చుచుండిరి.

నిబంధనలలోని సాత్మ్యత్వ మట్లుంచి నిబంధనలు మాత్రమే సుల్తానుచేత నుల్లంఘింపబడలేదని చెప్పవచ్చును. గంగూవంశస్థులతో మైత్రి చేయకపోయినను బహ్మనీసుల్తానులు వారికి జాగీరులిచ్చి వారిని తమ దర్బారునందే యుంచుకొనుచుండిరి. ఏబహ్మనీసుల్తానుగాని తాను బ్రాహ్మణహత్య చేయడు.

క్రీస్తుశకము 1463 వ సంవత్సరమున జూన్ నెలలో నొకనాడు హమ్మదాబాదునంతఃపురమున రాణియు, నైజాంషాయును హరశాస్త్రియు గూర్చుండిరి. రాణి యేబది యేండ్లది. హరశాస్త్రి నలుబది యేండ్లవాడు. రాణి మేలిముసుగులో నున్నది. నైజాంషాయొక్క పట్టుపరుపుపై నొరుగుడు దిళ్ళమీద నొరిగి కూర్చుండెను. హరశాస్త్రి దూరముగా నొక రత్నకంబళముమీద భాషీపెట్టుగా గూర్చుండెను.

రాణికన్నులు మాత్రము కనబడుచుండెను. తక్కిన యామె దేహమంతయు నెఱ్ఱని కాశ్మీర సేలువచేత నావరింపబడి యుండెను. నైజాంషా పదియేండ్ల బాలుడు. అతడు సన్ననివాడు. ఎఱ్ఱని దేహకాంతి కలిగి దీర్ఘములైన నేత్రములు కలిగి మొగము చూచినంతనే రాజకళ యుట్టిపడు

చుండును. కాని యాతని మొగమున నొక్క విషాదరేఖ ఛాయలు తోచుచుండును. హరిశాస్త్రికి తలకాని మీసలుగాని గడ్డముగాని నెరియలేదు. కండలుదేరి పుష్టిగల శరీరము, పొడుగైన గడ్డమును, మీసములును రెండు పాయలుగా దీసి నడితల ముడివేయఁబడిన జుట్టును గలిగి యతఁడు తెల్లనిదియును నంచులయందు జరీపని చేసినదియు నగు పట్టు సేలువ యొకటి కప్పుకొని యుండెను. అతని కన్నులయం దెఱ్ఱని చాఱలు కలవు.

ఆది ప్రాతఃకాలము. జాము ప్రొద్దెక్కినది. ఆకడచిన రాత్రి నైజాంషా యొక కల కనెను. చిన్నరాజు పుట్టినప్పటి నుండియు చిత్ర విచిత్రములైన కలలు కనుచుండెను. హుమాయూను బ్రతికియున్నన్ని నాళ్ళు నీస్వప్నములు లెక్క చేసినవారు లేరు. కాని యతఁడు పోయి రాజ్యము రాణి యధీనమునకు వచ్చినప్పటి నుండియు నామె యీ కలల విషయము విచారింప మొదలు పెట్టెను. ఆమెకు స్వప్నముల వాని ఫలములగూర్చి చాల విశ్వాసము. చిన్నరాజు కలలును వాని యందలి రాణి విశ్వాసమును దర్బారులోఁ గల కొందరు సరదారులకుఁ బరిహాసము కలిగించినది. గహాఁ తానీ స్వప్న విషయములందు జోక్యము కలిగించుకొనక నుభావముగా నుండును.

నైజాంషా కన్న కలయిది. అతఁడొక పెద్దయేట నీదుచుండెను. అతనిచేత చక్కగా నీదించుటకు వెంటనే యొక

షేకు వచ్చుచుండెను. ఇంతలో నొక మొసలి షేకును వేసికొని పోయెను. అతనికి భయమువేసి నీరింతయు ముక్కులం లోనికిని జెవుల లోనికిని బోయి యుక్కిరిబిక్కిరయ్యెను. మరల నెవరో యొకడు తనకు సాయముగ వచ్చుచున్నట్లయ్యెను. నాలుగంచెము దూరము పోయి యంతనే యాతోడు వచ్చుచున్నవాఁడే యతని మీదికి దూకి తన్ని ముంచివేసి నట్లు కాగా నతఁడు చనిపోగును. అంతభయమైపోమేల్కొనెను.

ఈ కల పరమార్థ మేమని రాణి హరశాస్త్రి నడిగెను. హరశాస్త్రి భయరహితుఁడు. తన నవాబు నందుఁ బ్రేమ కలవాఁడు. హరశాస్త్రి దాని కిట్లు వ్యాఖ్యానము చేసెను. సుల్తాను వెంటవచ్చిన షేకు హుమయూననియు నతఁడు మొసలిచే వేసికొని పోఁబడుట యతను ఖూనీ చేయఁబడుటయనియు నంతట సుల్తానుని కెవరో తోడుగా వచ్చుట గవాజ్ జహాఁగలకు హుమయూ నప్పచెప్పుట యనియు నతఁడు సుల్తానును నీటిలో ముంచుట వారిద్దఱుఁ గలసియో లేక యందొకరో సుల్తానును జంప యత్నించుటయు నని చెప్పెను. సుల్తానునకు రాణికిని కోపమువచ్చెను. హరశాస్త్రి యిట్లు చెప్పెను. "మీకు నా మాటయందు విశ్వాసము లేకపోవచ్చును. నాకును విశ్వాసము లేదు. గవాజ్ వంటి మహానుభావుఁ డుండగా నట్టి దెన్నఁడును జరుగదు. కాని యీ స్వప్నమున కింకొక యర్థము కాదుగదా. అదియుఁ గాక

స్వప్న శాస్త్రమున కొంత ప్రవేశము గలవాఁడను. అది మీ కిది వరకే చెప్పితిని. ఆ శాస్త్రములోఁ జెప్పినట్లు జరుగవచ్చును. జరుగకయుఁ బోవచ్చును. ప్రస్తుత మీ స్వప్నఫలము జరుగకపోవచ్చును. గవాన్ రక్షించుచున్న సుల్తానును త్రిమూర్తులయినను తేరిచూడఁ జాలరు." రాణి సుల్తానులు కొంచెము శాంతించిరి. కాని యిద్దరికి భయము వేసినది.

హరశాస్త్రి మనసులో జహానునుగురించి యనుమానపడినాఁడు. దానికిఁదోడు జహాను నిత్యము మహమ్మదుషాను దగ్గరకుఁ దీసి యతనితోఁ గలసి యుండును. నైజాంషాను జంపి మహమ్మదుషాను రాజును జేయవలెనని యతనియూహ కావచ్చును. అట్లైన నతని ప్రతిభ సాగించుకొనవచ్చును.

రాణి ప్రక్క తిరిగి చూచెను. ఒక మహమ్మదీయ యువతి పాన్‌దాను తెచ్చి హరశాస్త్రి కొసంగెను. ఇది యాతఁడు వెళ్లవచ్చు ననుటకు గుఱుతు. హరశాస్త్రి తాను రెండు వక్కలు నాకులు గ్రహించి సుల్తానునకు వంగిసలాము చేసి రాణివంకఁ దిరిగి తలవంచి వెనుకవెనుకగా నిష్క్రమించెను.

సుల్తాను రాణివంకఁ జూచుచుండెను. రాణి వేఱ యేదియో యాలోచించుచుండెను. హజారమున మొదటి జాము నౌబత్తులు మ్రోగెను.

---

## రెండవ ప్రకరణము

ఒకనాఁడు సాయంతనమున సూర్యుడు దిక్కులెల్ల జేగురుపూయు సమయంబున మహమ్మదాబాదునకు తూర్పున రెండుమైళ్ల దూరమున నిద్దఱాశ్వికులు కోట కభిముఖముగా గుఱ్ఱములను నెమ్మదిగా నడిపించుచు పోవుచుండిరి. అందులోఁ నొకయతనికి నలుబది యేండ్లుండవచ్చును. ఆమానిసి పొట్టివాఁడు. నల్లనివాఁడు. వెలగల దుస్తులు వేసికొనియుండెను. బిరుసుగా నున్న యతని నల్లని పొట్టిగడ్డము పొగవలె నుండెను. మొగము భయంకరముగా నుండెను. కన్నులలో మోసము కనవచ్చుచుండెను. అతనిప్రక్కనఖడ్గమొక్కటి వ్రేలాడుచున్నది. అతఁడు మధ్య మధ్య నవ్వుచు గుఱ్ఱము నదలించుచు స్వారి చేయుచుండెను. రెండవవాఁడు కుఱ్ఱవాఁడు వయసు తొమ్మిదేండ్లుండవచ్చును. అతఁడెక్కిన గుఱ్ఱ ముత్తమజాతిదైనను కొంచెము పొట్టిది. అతనిమొగము పసితనముచేత సుకుమారముగానున్నను ముఖరేఖలుమాత్రము కఠినములై యుండెను. అతని దేహచ్ఛాయయు నల్లనిదే. అతని మొగము చూచిన యంతనె యతడు భవిష్యత్తునఁ క్రూరుఁడగునని తోచును. అతని దుస్తులు మఱియును మొగలాయీగఁ గనఁబడుచుండెను. దుస్తులనుబట్టి యతడు రాజవంశమువాఁడని చెప్పవచ్చును. ఇద్దరును మహమ్మదీయులే.

కొంతసేపటి కిరువురిలోఁ బెద్దవాఁడు తనగుజ్జమును ముందున కురికించెను. రెండవవాఁడు తన్నుఁగూడఁగలసి రా నిమ్మనెను. మొదటివాఁడీమాత్రము గుజ్జమునే పరుగెత్తించ లేవేని రాజ్యమేమి సేయఁగలవని పరిహాసించెను. మరిరెండు నిమిషములలో నాకుజ్జవాఁడు తన గుజ్జమును పెద్దవాని గుజ్జముతోఁ గలిపి యిట్లనెను. "జహాన్! నాలుగైదు సారు లంటివి. రాజ్యము మాయన్నగారిది కదా! నేను రాజ్యమెం దులకుఁ జేయవలెను?"

జహా—నీవుకూడఁ జిత్ర విచిత్రములైన కలలు కం టివా రాజ్యము నీకును వచ్చును. ఎవరి కెక్కువ పిచ్చికలలు వచ్చునో రాజ్యము వారికి వచ్చును.

మహా—ఇటువంటి పిచ్చికలలు నాకురావు. నేను వానిని రా నియ్యను. జహాఁగా! నాకు కలలే రావు.

జహా—అందుకనియే నీకు రాజ్యము లేదు.

మహా—కలలు కనినచో రాజ్యము వచ్చునా!

జహా—మఱి సుల్తానుగారికి వచ్చుట లేదా!

ఇట్లుమాటలాడు కొనుచు నొకయరమైలు గడచిరి. ఇదివరకు చాలసారులు జహాన్ మాటలు మహమ్మదున కర్థము కాలేదు. తొమ్మిదేండ్ల యీ కుజ్జవాని మనస్సులో గడబిడలు మొదలుపెట్టెను. కొంచెముసే పాగి మహమ్మదు "జహాఁగా సాహెబ్! నాకును రాజ్యము చేయవలయునని యున్నది. రాజ్యము చేయుటకు కలలు రావలయును గదా! అవియెట్లు

వచ్చునో చెప్పుము" అనెను. జహాన్ తనమనసులో నవ్వు కొనెను. "రాజ్యము వచ్చినగాని సెలవు రావు" అని జహాన్ చెప్పెను. కొంచెము సేపు వారల నడచిరి.

జహాన్ "రాజ్యము వచ్చుట యనగా నేమి?" అని మహమ్మదును ప్రశ్నించెను.

మహా—తలపైన మాయన్న పెట్టుకొనుచున్న కిరీటము పెట్టుకొనుటయు సభలో పెద్దతఖతుమీఁదఁ గూర్చుండఁగా రెండువైపుల సిద్దీలు నిలుచుండి విసరుచుండుట కాదా! ఇంకను చాల భోగములు గలవు అని యన్నియు నన్నకు జరుగుచునే యున్నవి.

జహా—అవి యన్నియు మీకుఁ గూడఁ గావలయునా.

మహా—కావలయునా యేమి? ఎందు కక్కర లేదు. నాకన్న మాయన్న యేమి గొప్పవాఁడా!

జహాన్ కన్నులలో నొకవిధమైన చురుకుఁదన మేర్పడెను. కొంచెము సేపుండి అతఁడిట్లనెను. "కాని మీయన్నగారును మీరును నొక్కసారియే రాజుగా నెట్లగుదురు. ఎవరో యొకరే యుండవలయును."

మహమ్మదు కొంత యాలోచించి "అయినచోఁ గొన్నాళ్లు మా యన్నయు మరికొన్నాళ్లు నేనును రాజుగా నుందుము. కాదు. అచ్చముగా నేను రాజుగా నుందును."

జహా—మీ అన్నగారు రాజుగా నుండగా మీరెట్ల గుదురు. అగుటకు వీలు లేదు, మీ అన్నగారే రాజు,

మహమ్మదునకుఁ గోపమువచ్చి "అట్లయినచో మా అన్నను చంపి నేను రాజ నయ్యెదను" అనెను.

జహాఁన్ గుఱ్ఱమునాపి పశ్చిమదిశవంకఁ జూచెను. సూర్యుఁడప్పుడే ఖూనీచేసి వచ్చిన వానివలె దేహమంతయు రక్తము పూసికొనినట్లు ఎఱ్ఱగా నుండెను.

మరల మహమ్మదు "రేపు మా అమ్మగారినడిగి నేను రాజు నయ్యెదను." అనిపలికెను.

జహాఁన్—మీ అమ్మగారికి మీమీదకన్న మీఅన్నగారిమీదనే యెక్కువప్రేమ. ఆమె మీకు రాజ్యమియ్యదు, మీరడిగినచో మిమ్ము కైదులోవేయించును." ఏఁడాదివెనుక నొకసారి మహమ్మదు బాల్యచాపలమువలనఁ గిరీటము తాను పెట్టుకొనెదననెను. అప్పు డతనితల్లి "నాయనా! నీవు పెట్టుకొనరాదు. ఇంకెవరైన నట్లనినచో వారిని కైదులో నుంచుదురు" అని చెప్పెను. మహమ్మదున కిప్పుడాసంగతి జ్ఞాపకము వచ్చెను. జహాఁననినమాట నిజమేయనిపించి యతనికిఁ గనుల వెంట నీరుకారెను.

మహమ్మదు—"అయినచో గవాఁజ సాహేబుతో చెప్పెదను. అతఁడు నాకు రాజ్యమిప్పించఁడా?" యనెను.

జహాఁన్—మీఅమ్మగారు మిమ్ము కైదులోమాత్రమే వేయించును. అతఁడుమిమ్మురితీయించును. మీయమ్మగారికే మీమీదలేని ప్రేమ గవాఁజగారి కేలయుండును.

మహమ్మదునకుఁ గోపము వచ్చి "గవాఁజసాహెబు

నన్నురి దీయునా! నేనే! గవానును నురిదీయించెదను, నిలుచుండ బెట్టి నరికించెదను'' అనెను.

జహాన్—తనలో ''అట్లె కావలయును'' అని యనుకొనెను.

కోటకు మైలు దూరములోనికి వచ్చిరి. సూర్యుని యెఱ్ఱనికాంతులు క్రమ క్రమముగా మారుచుండెను. నేల యంతయు నల్లబడుచుండగాఁ బడమటిదిక్కు పండఁ గ్రాగినట్లు మరింత యెఱ్ఱపడుచుండెను.

మహమ్మదు—జహాన్ సాహెబ్; అట్లయినచో నీవే నాకు రాజ్యమిచ్చి గవానును నాచేతఁ జంపించ వలయును. ఏమందువు? మాటాడవేమి?

జహాను తనలో నాలోచించుకొనెను. మహమ్మదు, గవాను చేతిలోఁ జిక్కినచో, గవాను తన్నుఁ జంపింపడా! అట్లే తానును జంపించవచ్చును.

జహాన్—మహమ్మదుసాహేబ్! నాచేతనాపనికాదు. ఒకవేళనయినను దానికి చాలకష్టములున్నవి.

మహమ్మదా కష్టము లెట్టివో చెప్పుమని తొందర పెట్టెను. జహాన్ చాల నాలోచించినట్లు కనఁబడి యిట్లనెను. ''అయ్యా! రాజ్యముమీఁదఁ బ్రేమగలవానికి తల్లిమీఁదఁ దండ్రిమీఁద నన్నమీఁదఁ జెల్లెలుమీఁదఁ బ్రేమయుండరాదు మీకు మీయన్నమీఁద ప్రేమయున్నదా?''

మహమ్మదున్నదనెను.

అయినచో మీకు రాజ్యము లేదని జహాన్ పలికెను. మహమ్మదు 'అయినచో లేదు.' అనెను. జహాన్ నవ్వెను.

జహాఁ—'మీ అన్నగారిమీద మీకు ప్రేమ లేనిచో మీకు రాజ్యము వచ్చును. అన్నగారిమీదఁ బ్రేమ లేకపోవుట యన నేమో తెలియునా?''

మహమ్మదు తెలియద నెను.

జహాఁ—'ఆతఁడు చచ్చిపోయినను మీరు దిగులుపడ రాదు. ఎవ్వరితో నేమియు నీసంగతి చెప్పరాదు.

మహమ్మదునకు భయమెత్తెను. ఏదో మాటాడుద మను కొన్నాఁడు. కాని మాటాడ లేదు.

గుఱ్ఱము లింకొక యరమైలు నడచెను. ఇంకొక పావు గంటలో దుర్గద్వారము నొద్దకు వత్తురు. జహాఁ తన గుఱ్ఱము నచట నిలిపెను.

జహాఁ—'మహమ్మద్! నీకు నిజముగా రాజ్యము కావలసి నచోఁ జెప్పుము. నాలుగై దురోజులలో నిన్ను రాజును జేసె దను. కాని మీ అన్నగారింకఁ గనఁబడఁడు. నీకుఁ గిరీటము, తఖతు రత్నాలహారములు నివన్నియుఁ గావలెనా మీ అన్న గారు కావలెనా' అనియడిగెను.

మహమ్మదు ఆలోచించి 'రెండును కావలెను' అనెను

జహాఁ—'రెండును వీలు లేదు' అనెను.

మహమ్మదు రాజ్యమునకే సమ్మతించెను.

జహాఁ—మనసుతో గ్రంథ నేమో నా నీకు తెలిసి గ్లును గదా.

మహమ్మదు— తెలియును ఖురాను.

జహార్— ఆ గ్రంథముమీద నొట్టు పెట్టుకొనినతరు వాత మాటకు తిరుగరాదు. తిరిగినచో నల్లాకు తప్పిపోయి నట్లు, అది నీకు తెలియును గదా!

మహమ్మదు— అవును తెలియును.

జహార్—'నేడు మనము మాటాడిన మాట లెవరి తోడను చెప్పనని ఖురానుమీద మీరొట్టు పెట్టుకొనవల యును. ఎవరితోనైనఁ జెప్పినచో మీకు రాజ్యమురాదు. మిమ్ము కైదులో నుంచెదరు. నన్నురితీయింతురు.

మహమ్మదు ప్రమాణము చేసెను.

జహార్—ఈమాట లిప్పుడేకాదు. మీకు రాజ్యము వచ్చిన తరువాతఁగూడ నెవరితోడను జెప్పరాదు.

కోటగుమ్మమునొద్దనున్న దివిటీలవెలుతురులో వారిరు వురి గుఱ్ఱములు కోటలోనికిఁ బోయెను. ఆవేళకు హరశాస్త్రి యెందుకో కోటగుమ్మముదరిని నిలుచుండెను. జహార్ మొగ ములో నొక వికృతమైన సంతోషము మహమ్మదు మొగఁ ములో దిగులుతోఁగూడిన ఒక్కఁదనము హరశాస్త్రికిగోచ రించెను.

---

1463

[illegible]వ సంవత్సరము జూలై 29 వ తారీఖున బిదరు కోటలో సూర్యోదయావసరమునఁ బెద్ద గందరగోళముగా నుండెను. సేవకు లెక్కడివా రక్కడఁ గుక్కిన పేలవలెఁ గదలక మెదలక భయభ్రాంతులై యుండిరి. ప్రతిమనుజుని ముఖలక్షణములు నాశ్చర్యభయపరీతములై యుండెను.

గవాన్ మంత్రి, శ్వేతాశ్వమును హజారమందు దిగి నిశ్చలమును గంభీరమును భయదమును నగు ముఖముతోఁ గొంచెము వేగముగనే లోనికి వచ్చుచుండెను. దారిలో నందరు నొద్దుకొని త్రోవయీయఁగా నాయన సుల్తాను నిద్రించు గదియొద్దకుఁ బోయెను. అచటి కావలివాఁడు తనచేతులు మొగముమీదఁ గప్పుకొని యేడ్చుచుండెను. గవా నచ్చట రెండు నిముసములాగి వానివంకఁ దీక్ష్ణ దృష్టులను నిగిడించి కొంచెము సేపుండి లోనికిఁ బోయెను. రాణి గవానును జూచినంతనే పెద్దపెట్టున నేడ్చెను.

గవాను తనదృష్టి రాజు నిద్రించు శయ్యవంకకు మరలించెను. నల్లని ముఖమ్మలు పరచిన సుల్తాను శయ్యమీఁద నెత్తురు మరకలు విస్పష్టముగఁ గనవచ్చుచుండెను. సుల్తాను గుండెమీఁద బలమైన కత్తితోఁ బొడిచిన గాయమునుండి నెత్తురు ప్రవహించుటలేదు గాని యిదివఱకు ధారాళముగాఁ

ప్రవహించిన క్లిగపడుచుండెను. సుల్తాను ముగము వికృతా
కారము వహించియుండెను.

గవా నేడ్చుచున్న రాణిని చూచి తన చేయి నెత్తెను.
ఆమె తన యేడ్పు నాపుకొనియెను. గవానా మెనుచూచి "తల్లీ!
యేడువకుము. మీకొక్క దుఃఖమేగాని నాకదుఃఖముతోం
బాటు పాపముకూడ సంభవించినది. మహారాజైన హుమ
యూను నాకప్పగించి పోయిన చిన్న సుల్తానును రక్షించ లేక
పోయిననా తప్పునకు నేను శిక్ష ననుభవించ వలసియున్నది.
ఆశిక్ష భగవంతుడు నాకెట్లు కలిగించునో తెలియదు
గదా?" అనిపలికి మక్కాదిక్కు మొగమై మోకారించి
తన రెండుచేతులను పైకెత్తి ప్రణమిల్లుచు భగవంతుని
ప్రార్థించెను.

మోకారించి ప్రార్థించుచున్న యాదీర్ఘకాయుని పలిత
మైన గడ్డము, విషాదమును మరింత వెల్లడించెను. విశాలమై
మహైశ్వర్యమును సర్వత్ర సూచించు నాగదియునందలిశయ్య
మీదనున్న రాజకుమార శవమును ప్రక్కన గూర్చుండి
మొగమున గుడ్డ కప్పుకొని యేడ్చుచున్న రాణియును
నామెకుం గొంచెము దూరమునం బ్రార్థించుచున్న గవాను
మూర్తియు నిది యంతయుం జూచినచో నొక చిత్రకారుని
విషాదభావనిర్గతమైనదియు విచిత్రవర్ణసంశ్లేష్టము కలదియు
నగు నొక సృష్టివలె నుండెను. కొన్ని నిమేషములవరకు నిశ్శ
బ్దము.

గవాక్ ప్రార్థనముగించి లేచినంతలో నాతని నేత్రములనుండి సంతత ధారగా బాష్పములు స్రవించుచుండెను. ఇంతలో జహాఁక్ లోనికివచ్చెను. జహాను లోనికి వచ్చినంతనే రాణి మరల పెద్దపెట్టున నేడ్చెను. జహానుగది నాల్గు వైపులఁ బరిక్షించి యాశ్చర్యపోయి రాణితో 'రాణీ! నేని వార్త నమ్మ లేకపోతిని. ఇట్టిమహాసాహసము చేసినదుర్మార్గుని వెంటనే బంధించవలయును.' అని కోపముతోఁ బలికెను. గవాక్ జహాఁక్ వంక నిశ్చలముగాఁ జూచెను. జహాఁక్ వెంటనే కాపలి వానిని బిలిచి 'యేమిరా! నీకుఁ దెలియకుండ నీపని జరుగదు. నిన్ను నరకించెదను. నిజము చెప్పు'మనియెను. వాఁడు నిలువున బెంబేలుపడి నిశ్చేతనుఁడై పోయెను. వాని కన్నులలోనుండి జ్యోతిస్సు వెడలిపోయెను. దేహమునఁ బ్రాణములుకొట్టుకొనబట్టెను.

గవానింతవరకు నెమ్మదిగా నుండెను. ఇప్పుడతఁడు జహానునుగాంచి 'సాహెబ్ జీ! వానికేమియుఁ దెలియదు. తెలియుట కవకాశము లేదు. ఇది ప్రత్యక్ష పురుషులు చేసిన పనికాదు. పరోక్షమందున్న వారెవరో చేసినపని' యనెను.

జహాఁక్—పరోక్షమందున్నవారే చేయవలె. కాని వీఁడుకూడ వారిలోఁ గలసియున్నవాఁడు కావలయును.

గవాక్—సాహెబ్! అట్లుకాదు. వీనితప్పు వారితని తప్పుద్రావించిన తప్పుద్రావుట యొక్కటియే. దానికివీనిని శిక్షించవచ్చును. అసలీపని యెవరు చేసిరో యెవరు చేయించిరో తెలిసికొనుట మనవిధి.

జహాక్—అది కనిపెట్టియే తెలిసికొనవలెను.

గవాక్—అది బెదరించి కాదు. నెమ్మదిగాఁజేయుట తగును

జహాక్—ఇట్టివానితో నెమ్మదిగా మాటాడ వలయునా! వీనిని నిలువునఁ దోలొలిపింపవలయును. కాగుచున్న నూనెలో దించవలయును.

గవాక్—సాహెబ్ జీ! రాజకుమార శవమచ్చట నున్నది. మనము శాంతముగా నుండవలయును. ఇది దుఃఖ సమయము. కోపమునకుఁ దగిన వేళ కాదు.

జహాక్—అయ్యా! మీమాటలు నాకర్థమగుట లేదు. రాజు ప్రాణములు నిలువునఁ దీయబడెను. నాయొడలు మండి పోవుచున్నది. మీకు శాంతము గావలయును. రాజభక్తి యిట్లుండునని నే నెన్నఁ డనుకొనలేదు. అయినను మీకేమి? మా దేశపురాజు పోయినప్పుడు మాకిట్లేయుండును. ఇతఁడు మీ పర్షియాదేశపు రాజు కాఁడుకదా!

గవాక్ మరల మాటాడలేదు. రాణి కూర్చున్నచోటి నుండి లేచి జహాక్‌తో "అయ్యా! ఇది పోరాడుకొనఁ దగిన వేళ కాదు. సుల్తానునకు గోరీ కట్టించుటకువలయు ప్రయత్నములు చేయవలయును. మహమ్మదును తీసికొనివచ్చి యన్నగారిని చూపింపుఁడు" అనెను. జహాక్ వెంటనే 'మహమ్మదు గారు తనయన్నగారి శవము చూడరాదు. అతఁడును చిన్నవాఁడే. శవమునుజూచి భయపడవచ్చును. అట్లు చేయరాదు' అని చెప్పెను. గవాక్ కన్నులుమూసికొని నిలఁబడెను.

ఇంతలో హరశాస్త్రి లోనికి వచ్చెను. అతడు వచ్చెనని యెవ్వరును కదల లేదు. అతడు వారినిముగ్గురను జేరి పారఁ జూచి గవాన్ వెనుకగా రాజశవము సమీపించి యచ్చటఁ గూర్చుండి మొగమునఁ జేతులుంచుకొని దుఃఖించెను. గవాన్ వెనుదిరిగి యాతని దుఃఖమును చూచుచుండెను. హరశాస్త్రి యట్లు కొంతసేపు దుఃఖించి కన్నులు తుడుచుకొని మరికొంతసేపు విషాదముఖముతో సుల్తాను వంకఁ జూచి లేచి నిలుచుండెను. అతడు మెల్లిదిగా వారి ముగ్గురి ముందరకు వచ్చెను. అతడు గవాన్ ముందు నిలుచుండి నఖశిఖపర్యంత మాతనిని రెండు నిముసములవరకట్లే చూచెను. అట్లు చూచినంతసేపు గవాన్ నిశ్చలుఁడై ధ్యానించుచుండెను. హరశాస్త్రి తరువాత జహాన్ వంకకుఁ దిరిగి యాతనిని జూడ మొదలుపెట్టెను. అట్లతడు చూచిన కొలది జహానునకుఁ గోపము రాఁ దొడంగెను. చివరకు హరశాస్త్రి రాణివైపు తిరిగి 'తల్లీ! సుల్తానుగారి కల నిజమైనది. సుల్తానును చంపిన యొక్కఁడు. ఇక్కడ కాదు. ఆయొక్కఁడెవడు?' అనెను.

రాణి నిశ్చేష్టయై నిలచి పోయెను. గవాన్ నిస్తబ్ధుఁడై యుండెను. జహాన్ కోపముతో 'కాఫర్' అనెను.

హరశాస్త్రికిఁ గోపము వచ్చెను. అతడు జహానుతో "సాహెబ్ జీ! సుల్తాను, మహమ్మదీయులకే చెందరు. కాఫరులకును జెందుదురు. అందులో బహ్మనీరాజులు బ్రాహ్మణరాజులు.

మ్మదు జహాన్‌సాహెబ్ సుల్తానుకాలేదు. మహమ్మదుషాతోఁ గలసి షికారు వెళ్ళి రావచ్చును. ఆతఁడు సవాౖైనప్పుడు మీరు మీయాజ్ఞ చెల్లించవచ్చును. ఇప్పుడు రాణీగారిదే యాజ్ఞ."

జహానునకు యొత్తిపొడుపు హృదయమున కంటుకొనెను. జహాను కత్తిపిడిమీఁదఁ జెయివైచెను. రాణికిఁ గోపము వచ్చెను. "జహాన్‌సాహెబ్" అనెను. జహాను వణఁకిపోయెను.

హరశాస్త్రి ఇట్లనెను. "నేను బ్రాహ్మణుఁడను. అందులో గంగావంశ్యుఁడను. బ్రాహ్మణాపద బహ్మనీ సుల్తానులు చేయరాదు. తల్లీ! నీ యాజ్ఞయైనచో వెళ్ళెదను." రాణియాజ్ఞ యైనది. హరశాస్త్రి వెడలిపోయెను.

---

# నాలుగవ ప్రకరణము



సుల్తాను సిమరించు గడించుచున్న కొపలివాడు వాని యత్నఫలముగాc జెరసాలయందుంచబడెను. వాడా నాటి సాయంత్రమున సింకొకనితోc గలసి త్రాగెను. ఆ రెండవ వాడు వీనిని బలవంతము చేసి త్రాగించెను. ఆ రెండవవాడు పరారియయ్యెను. వానిజాడ తెలియలేదు. వానికై రాజ భటులు తిరుగుచుండిరి.

నైజాంషా శవమును నవాబుల గోరీలున్న స్థలమునకు దీసికొనిపోయి మహావైభవముతో సమాధిచేసిరి. జహాన్, చెప్పినట్లు, మహమ్మదుషాను తనయన్నగారి శవమును చూడ నీయలేదు.

వారము రోజు లయిన తరువాత మహమ్మదుషాకుc బట్టాభిషేకము జరిగెను. మహాసభలో రత్నాల తఖతుమీద మహమ్మదుషాను గూర్చుండబెట్టిరి. సభలోనున్న సరదారు లందరు నొకరొక్కరే వచ్చి యాతనిదగ్గర మోకరించి యాతని ఖడ్గమును ముద్దుపెట్టుకొనిపోయిరి. మహమ్మదుషాతలకుc గిరీటము మెడలోనికి హారములు వచ్చినవి. ఆతనికిc గుడివైపున గవానును, ఎడమవైపున జహానును నిలచియుండిరి. పట్టాభిషేకము జరిగినంతసేపు మహమ్మదుషా జహానుపంకనే చూచుచుండెను.

షాను దివ్యాంబరాభరణ భూషితమైన మహా గజముపై నెక్కించి యూరేగించిరి. తిరిగి వచ్చిన తరువాత సుల్తానునకు సరదారులందరునజరానాలనుజదివించిరి. అప్పుడు వారిచ్చిన ధనరాసులు భూషణములు నిలువెత్తున ప్రోవుగాఁ బడెను. మహమ్మదు అవి చూచినంతనే తాను నవాబగుట నిజమనుకొనెను. ప్రొద్దు గ్రుంకువేళకు సరదారులు జనము నందరు నెవరిదారిని వారు పోయిరి.

మహమ్మదుషా యంతఃపురమున నొక పెద్దగదిలో రత్న కంబళముమీదఁ గూర్చుండెను. ఒక యువతి వీవన విసరుచుండెను. మరియొకతె హుక్కా-గొట్టము పుచ్చుకొని నిలుచుండెను. మరియొకతె తమలపాకుల వక్కల పెట్టెపుచ్చుకొని యుండెను. ఇంకొకతె యెఱ్ఱని రత్నములు పళ్ళెములో బోసి క్రొత్త నవాబునకు హారతి యిచ్చుచుండెను. గవాక్ జహాను లిరువురును నవాబున కిరువైపులఁ గూర్చుండిరి. రాణి దూరముగానున్న యొక యాసనముపై మేలి ముసుంగుతోఁ గూర్చుండియుండెను. కొంతసేపటికి మహమ్మదు జహానువంకఁదిరిగి 'నేనిప్పుడు సుల్తాను నైతినిగదా!' అనెను. జహాను గవానువంకజూచి 'అవును ప్రభూ!' అనెను. రాణి గవానువంకఁజూచెను. గవానంతగుమ్మఖుఁడై యుండెను.

మహ:—'నేనిప్పుడే యాజ్ఞ యిచ్చినను నది చేయ బడవలెను గదా' యనెను. జహాను మరల గవాను వంకకుఁ దిరిగి 'చిత్తము' అనెను. గవానుకీ నాటక మర్థము కాలేదు.

గవాను తానింక జహాను చేతిలోఁ జిక్కితి ననుకొనెను. కాని గవానునకుఁ దన నీతియందే యెక్కువ విశ్వాసము. ప్రొద్దు పోవుటచే మంత్రు లిద్దరు వారియిండ్లకు వారు పోయిరి. రాణి మహమ్మదుషాను తన గదిలోనే యారాత్రి పరుండబెట్టుకొన నిశ్చయించెను.

మహమ్మదుషాకుఁ గిరీటము హారములు తక్కినభూష ణములు దుస్తులు తీసి యవి యన్నియు నొకపెద్ద యినుప పెట్టెలోఁ బెట్టి తాళమువేసి యాతాళపుఁ జెవులు రాణిగారి యొద్ద నుంచబడెను. సుల్తానును దాసీలందరుస్నానమాడిం చిరి. ఒక వృద్ధుడైన మౌల్వీ వచ్చి నమాజు చేయించెను. రాజునకుఁ బరిశుభ్రములైన దుస్తులు తొడిగి భోజనము చేయించిరి.

మహమ్మదునకుఁ బ్రతివిషయమునందును దానుసుల్తా నగుట గోచరించెను. అతనియందుఁ బరిచారకులు చూపు శ్రద్ధలో నతనికి జరుగు పరిచర్యలలోఁ బూర్వమున కన్న లక్షరెట్లెక్కువగా నున్నదని యతఁడభిప్రాయపడెను. అతని కాళ్లకొకతె రతనాలు పొదిగి బంగారుపని చేసిన పైజారులు తొడిగి యొక యువతి యాతని భోజనముచేసిన చోటునుండి రాణిగారి యొద్దకుఁ దీసికొని పోయెను. ఆ త్రోవయంతయు నుత్సవమే జరుగుచుండెను. యువతు లనేకులు పాటలు పాడుచు నృత్యము చేయుచుండిరి. అందరు నవాబును చూచినంతనే వంగి సలాములు చేయసాగిరి.

మహమ్మదునకుఁ దానొక దేవలోకములో నున్నట్లుండెను. ఇంతలో నొకతె మహమ్మదు మీఁదఁ బన్నీరు చిలికెను. ఆస్త్రీ కన్నులలో దీపములు తళతళ లాడెను. మహమ్మదు దాని కన్నులు బాగున్న వనుకొనెను. కొంతసేపుమహమ్మదు నా యుత్సవము జరుగుచున్న పెద్దసావడిలో మధ్యనున్న యొక బంగారపు ముఖమలు పరుపులు పరచిన యాసనము మీఁదఁ గూర్చుండ బెట్టిరి. అతని చుట్టును స్త్రీలు చేరి నృత్యములు గానములు చేసిరి. అందులో నొకతె మహాసౌందర్యవతి, గొప్పనర్తకి, యాతని యెదుట నృత్యముచేసి నృత్యము చేయుచు చేయుచు మధ్యవచ్చి యతని కాళ్ళు ముద్దుపెట్టుకొనెను. మహమ్మదునకొడలు పొంగిపోయెను. అతఁడాయావేశములో దాని మొగముమీఁద పైజారు కాలుతో దన్నెను. దానికది కొంచెము బాధకలిగించినను లేనినవ్వు తెచ్చుకొని యింకొకపాట పాడి యతనికాలు మరియొకసారి ముద్దిడుకొనెను. మహమ్మదునకుఁదాను సుల్తాననగా నట్లుండవలెనను కొనెను.

రాత్రి చాలప్రొద్దుపోయెను. సుల్తానును రాణిగారి గదిలోనికిఁ దీసికొని పోయిరి. అతనిని మెత్తని యారుపరుపులమీఁద పట్టుశెల్లాలు పరచి పరుండ బెట్టిరి. అట్టి మెత్తని సెజ్జమీఁద మహమ్మదదివరకుఁ బరుండ లేదనుకొనెను. అంతఃపురమునఁ గ్రమక్రమముగా ధ్వని తగ్గిపోఁ జొచ్చెను. ఎక్కడివా రక్కడకుఁ బోయిరి.

క్రొత్తరాజు కనులు మూసికొని నిద్రపోనెంచెను. అతని మనస్సంతయు నానందమయముగా నుండెను. అతని మనస్సు పరిపరి విధములఁ బోయెను. కొంతసేపు తనమీదఁ బన్నీరుచల్లిన స్త్రీ మీద నిలచెను. దాని కన్నుల తళతళ మీద మరికొంతసేపు నిలచెను. తరువాత తాను తన్నిన నర్తకిని గురించి యూహించెను. అంతలోఁ దన కిరీటము హారములు దివ్యభూషణములు వీనిమీదికి మనస్సు తిరిగెను. అంతలో ఖ్వాజామహమ్మదుజహాన్ జ్ఞాపకమునకు వచ్చెను. అతఁడు చాల మంచివాఁడుగాఁ దోచెను. అన్నట్లుగా నతఁడు తన్ను రాజును చేసెను. కాని యతఁడు తన్నెట్లు రాజును చేసెనో తెలియలేదు. అతఁడా రీతిగాఁ దనతోఁ జెప్పిన వారమురోజులలోనే తనయన్న యేల చనిపోయెనో యత నికిఁ దెలియలేదు. మధ్యమధ్య తనకు రాజ్యమిచ్చుట_ తన యన్న యెచటికో వెళ్లె ననుకొన మొదలుపెట్టెను. ఇంతలో మరల మనస్సు కిరీటము నగలు హారములు నర్తకిమహమ్మదు జహాన్ మొదలయిన వాని మీదికిఁబోయెను. కొంతసేపటికి చాల నలసటపొందిన యతని పసిదేహము మనస్సు ప్రాబ ల్యమును తగ్గించి నిద్రపట్టించెను. నిద్ర పట్టినదేకాని యా నిద్రలో నతఁడు పెద్దకలగనెను. ఆకలలోఁదాను బాకుపుచ్చు కొని తన యన్నను జంపినట్లు వచ్చెను. అతనికి భయము మిక్కుటమయ్యెను. ఆ కలయే మరల మరల రాఁదొడం గెను.

ఆరాత్రి చిన్నరాజు నిద్రించుచుండఁగా నొక ముసుగు పెట్టుకున్న యొక దీర్ఘ కాయుని సిద్ధియొకఁడు రాణి యంతః పురమునకు నిగూఢముగాఁ దెచ్చెను. అతఁడును రాణియుఁ గలసికొనినంత నే సిద్ధివాఁడు దూరముగాఁబోయినిలుచుండెను. ఆ వచ్చిన పురుషుఁడు తన ముసుగుతీసి రాణితో "తల్లీ! రహస్యము తెలిసినది. ఈ వారము రోజులనుండియు జహాన్ ప్రవర్తనకు నేడు దొరకిన సాక్ష్యమునకు సరిపోయినది" అనెను.

రాణి—సాక్ష్యమెట్టిది.

గవాన్— ఆ పారిపోయిన సేవకుఁడు జహానునింటిలో నున్నాఁడు. వానిని నా సేవకుఁడొకఁడుపోయి కనిపెట్టివచ్చెను. అతఁడు మన్త్రియగుటవలన రాజభటులచ్చట వెదుకలేదు. వెదకినను జహాన్ వానిని రక్షించును. మహమ్మదుషా యతని మత్తులోనున్నాఁడు. ఆమత్తు తొలగినఁగాని జహాన్ సాహేబును శిక్షింపలేము. తల్లీ! హుమయూన్సుల్తాను నాకు రక్షించుమని యిచ్చిన చిన్నరాజును రక్షింపలేక పోయితిని. జహానును శిక్షించిన మాత్రమతఁడు తిరిగివచ్చునా."

రాణి—అతఁడు తిరిగివచ్చినను రాకున్నను జహాన్ శిక్షార్హుఁడే. కావున మహమ్మదు మనస్సు జహానునుండి నేను త్రిప్పు ప్రయత్నముమీఁద నుందును. అది జరుగు వరకు జహానును గదలించరాదు.

గవాన్ తన మనస్సులో రాణి రాణితనమును మెచ్చు కొనెను. కాని తల్లికిఁగడకొట్టు తనయునియందలి ప్రేమయుఁ దెలిసికొనెను. నైజాంషామీద జాలి యతనికి రెట్టింపయ్యెను. అతని కన్నులవెంట నీరుకారెను.

అది రాణికిఁ దెలిసెను. ఆమె—గవాన్‌సాహెబ్ జీ! ఈ బిడ్డయానందమును చూచి నా కాబిడ్డదుఃఖము కొద్దిగాఁ దరిగినది. మీకుఁ దరుగలేదు. తండ్రీ! మీరు హుమయూను సుల్తానునకు నే నెంత మంచిభార్యనో అంతకన్న మంచి మంత్రులు, మీరుధన్యులు.' అనిపల్కెను.

గవాన్ రాజాంతః పురమునుండి వెడలిపోయెను. మరు నాఁడు మహమ్మదుషా జహానును కలసికొని నంతనే 'జహాన్' నేను రాజునైతిని. కలయువచ్చెను అనెను. జహాను మొగము విషణ్ణమయ్యెను. మహమ్మదు 'కల చాల చిత్రముగా నున్నది. మా అన్నను చంపినదినేను.' అనిచెప్పెను.



## ఐదవ ప్రకరణము



హరశాస్త్రి యానాఁడు సాయంతనమే బయలుదేరి యహమ్మదాబాదును వదలి పోయెను. జహాన్ అతని ప్రయాణమున కభ్యంతరము గలిగించవలెనని తలంచెగాని గవాను యొక్క తీక్ష్ణదృష్టినుండి తన్నుఁ దా రక్షించుకొనుటతోడనే యతనికి సరిపోయినది. అది హరశాస్త్రికి వీ లిచ్చినది.

హరశాస్త్రి యహమ్మదాబాదులోని తన యింటికిఁ దాళము వెట్టి యొకబండిమాటాడుకొని తనయొద్దనుండినధనము చేకొని యందులోఁ దనతల్లి నెక్కించుకొని బయలుదేరెను. మొదల నెక్కడకుఁ బోవలయునా యని యతఁడూహించెను. వందయేండ్ల క్రింద గంగూబ్రాహ్మణుఁడు దక్షిణాపథమునకు వచ్చినప్పుడు తాను భార్యతోడను నొక కుఱ్ఱవాని తోడను వచ్చెను. ఆకుఱ్ఱవాఁడు పెద్దయయి యతనికిఁ గాశియందే సంబంధము కుదిర్చి పెండ్లిచేసెను. ఆతనిపేరు కాలనాథభట్టు. కాలనాథభట్టునకు గూడ నొక్కఁడే సంతానము. కాలనాథభట్టు నలుబదియేండ్లు దాటకముందే చనిపోయెను. అతని కుమారుఁడు విశారదభట్టు. గంగూవిశారదభట్టు కలబరగిలో నున్న యొక బ్రాహ్మణ కుటుంబములోని యొక బాలికను బెండ్లాడెను. ఈవిశారదభట్టునకు హరశాస్త్రి కుమారుఁడు.

అతని తండ్రి యతనికి ముప్పదియేండ్లు రాకముందేపోయెను. హరశాస్త్రి యోరుగల్లులోని యొక బ్రాహ్మణ బాలికను వివాహమాడెను. ఆమె హరశాస్త్రి తండ్రిపోయిన యేఁడాదిలోనే పోవుటచేత హరశాస్త్రి కొకవిధమైన విరాగము పుట్టి తరువాత నెంతమంది పిల్లనిచ్చెదమని వచ్చినను మరల వివాహముచేసికొన్నాఁడు కాదు. ఆభార్య పోయినప్పటినుండియు వారింటికి వీరు వీరింటికి వారు రాకపోకలు లేవు. అయినను హరశాస్త్రికి నత్తవారిమీఁదఁ బ్రేమకలదు. ఆప్రేమ యెందులకో యతనికిఁ దెలియదు. ఓరుగల్లునకు బీదరునకుఁ జాల దూరము. బండిమీద పది రోజులు ప్రయాణము. త్రోవ యడవులలోన నుండి. అందుచేతఁ బగలు ప్రయాణముచేసి రాత్రులయందు మానివేయుదురు. కాని యహమ్మదాబాదు నుండి యొకరాత్రి ప్రయాణము వరకును భయము లేకుండుటచే హరశాస్త్రి బయలుదేరెను.

హరశాస్త్రి జ్యోతిషము సాముద్రికము శకున శాస్త్రము నెరుంగుటచే జనులాతనినిచాలగౌరవించుచుండిరి. ఆతఁడు వెళ్లిపోవు చుండెననగా జనులెంతయో బ్రతిమాలి యాపఁ జూచిరి. కాని యాతఁడాగలేదు. , ఆతనిని వదల లేని యాతని వెంటనొక మహమ్మదీయుఁడుకూడ బయలుదేరెను. అతనికి బంధుమిత్రు లెవరును బీదరున లేరు. ఆతఁడు చాల బలిష్ఠుఁడు కత్తిసాము మొదలయినవి నేర్చినవాఁడు. వానితోఁ హరశాస్త్రి పయనము చేసెను.

హరశాస్త్రి యోరుగల్లుచేరి తన యత్తవారింటికిఁ బోయెను. అచటఁ గొన్నాళ్ళుండెను. కాని యేమియుఁ దోచినదికాదు. తల్లి నచ్చటనుంచి యామె కగు ఖర్చునకుఁ గొంతపైకమిచ్చి రాజమహేంద్రనగరమునకుఁ బోనుద్దేశించెను. అచ్చటికిఁబోయి గజపతులయొద్ద నేదైనయుద్యోగము సంపాదించవలయునని హరశాస్త్రియూహ. తన జ్యోతిషాది శాస్త్రములతోనే హరశాస్త్రి నిక్షేపముగా బ్రదుకవచ్చును. గాని యాతఁడీ విద్యల నుపయోగించి ధనము పుచ్చుకొనఁడు. తనయొద్దనున్న ధనము తనకుఁ దన తల్లికి జీవితము చాలదు. బీడరులోని యిల్లు నమ్మదలంచెను. గాని యది యమ్ముటకు సావకాశము లేకపోయెను. ఇప్పుడు వెళ్ళవలయు నన్నను చాల ప్రయాస పడవలయును. అసలుద్యోగము సంపాదించ వలయునని హరశాస్త్రికి గట్టియూహ కలిగెను. ఈ యూహతో నాతఁడు తన తల్లి నెట్లైననేమి యొప్పించి తనవెంట వచ్చిన మహమ్మదీయునిఁ దీసికొని బయలుదేరెను. కాని యీ యాత్రయు నడవులలో నుండియే. ఇదియు నొక యిరువదిరోజుల ప్రయాణము.

ఓరుగల్లునుండి కంబముమెట్టు వచ్చి యచ్చట రెండు రోజు లాగి మరల బయలుదేరి చిన్నచిన్న యాత్రలలో నాగుచు వారము పదిరోజులలోఁ గొండపల్లి వచ్చి చేరిరి. కొండపల్లి దగ్గర కొండమీదఁ గోటయున్నది. అది యపుడు గజపతుల స్వాధీనములో నున్నది. హరశాస్త్రి కొండపల్లికిఁ

జేరి యచ్చట రెండుదినములు నిలువ నెంచెను. గజపతుల వర్తమాన మంతయుఁ గొండపల్లిలోఁ దెలిసికొని తరువాతఁ బోవలెనని యాతఁడాలోచన చేసెను. అందుచేతఁ గొండపల్లినుండి యావర్తమానములు కనుగొన మొదలు పెట్టెను.

విద్యకూడ వ్యసనమే. కవిత్వముసంగీతముజ్యోతిషము సాముద్రికము మొదలయిన విద్యలు కలవారు. తా మెంత సేపు వానిని గూర్చియే యాలోచించు చుందురు. హరశాస్త్రి దారివెంటఁ బోవుచు మనుజులవంక నిదానించి చూచును. వారి ముఖలక్షణములను చూచి వారివారి యదృష్టములు చదువుకొను చుండును. ఈసంగతి హరశాస్త్రి యెక్కడ నిలు చుండిన నక్కడ నందరికిఁ దెలియును. హరశాస్త్రి యీసంగ తులు బిడరునం దందరికిఁ జెప్పి చెప్పి యోరుగల్లునకు వచ్చెను. ఓరుగల్లున నందరకుఁ జెప్పిచెప్పి కొండపల్లి చేరెను. కొండపల్లిలో హరశాస్త్రి చుట్టును వేనవేలు జనము ప్రోవు వడిరి. ఆతఁడు వారందరికిఁ దలకొకరీతిని ఫలములు చెప్పు చుండెను. ఈ ఫలములు చెప్పుటలో నాతనికి విసుగు విరా మము లక్కరలేదు.

హరశాస్త్రి కొండపల్లి వచ్చిన యైదవనాఁడు తానొక బ్రాహ్మణుని యరుగుమీదఁ గూర్చుండి యాతని కుమారుని జాతకము పరిశీలించుచుండఁగా నొక బాలిక వారియింటికి ముష్టికై వచ్చెను. ఆబాలిక కయిదారేండ్లకన్న నెక్కువ

యుండవు. పిల్లతలవెండ్రుకలసంస్కృతములై చిక్కగానుండెను. బాలిక బక్కపలుచగా నుండెను. పిల్ల యెఱ్ఱనిదైనను పోషణ లేక నల్లపడి యుండెను. ఆబాలిక యొక చింపిరి పరికిణీ కట్టుకొని పైన తుండుగుడ్డ యొకటి వైచుకుని యందులోఁ బెట్టిన బిచ్చపు గింజలు మూట గట్టుకొను చుండెను. ఆ పేదబాలిక చూచుట కసహ్యముగా నున్నను పరిశీలించి చూచు వారి కామె మొగము రేఖలు రమ్యములుగా నున్నవని తెలియక పోదు.

హరశాస్త్రి యామెవంక నిదానించి చూచి యా యమ్మాయి యెవరనియడిగెను. ఆయింటి బ్రాహ్మణుఁడామె యొక బీదపిల్ల యనియు నామెయు నామె తండ్రియు నూరికి దక్షిణమున చెరువుదగ్గఱ నొకచిన్న పూరింటిలో నివసింతు రనియుఁ జెప్పెను. హరశాస్త్రి యా బాలికను నీ పేరేమని యడుగఁగా నామె 'రాధ' యని చెప్పెను. హరశాస్త్రి యాఁ పిల్లను దగ్గఱకు పిలిచి యామెచేయి చూచెను. ఆపిల్ల చేయి అదేపనిగ నాతఁడొకగంట చూచెను.

ఆయింటి బ్రాహ్మణుఁడు హరశాస్త్రి నా పిల్ల జాతక మెట్టిదని యడిగెను. హరశాస్త్రి మారాడలేదు. ఆపిల్ల తన దారిని తాను బిచ్చమెత్తుకొనుచుఁ బోయెను. హరశాస్త్రి తాను బసలో భోజనముచేసి రెండుజాములకు వెదకుకొనుచు నా బిచ్చపుఁ బిల్లయింటికిఁ బోయెను. ఈతఁ డచ్చటికిఁ బోవు వరకు నా బాలిక వాకిటఁ గూర్చుండి రెండు టేకాకు లటం

బొడుముచుండెను. ఆమె హరశాస్త్రిని చూచినంతనే బాల్య
చాపలమువలనఁ గుట్టుచున్న విస్తరి యచటఁబెట్టి తనచేయి చూడుమని యడిగెను. ఇంతలో నింటిలోనుండి తండ్రి విస్తరి యైనదాయని కేకవేసెను. రాధ మరల విస్తరికుట్టు చుండెను. హరశాస్త్రి తా నామె కెదురుగాఁ బోయి కూర్చుండెను.

రాధ తండ్రిపేరు గోపన్న. ఇతఁడు చాల పేదవాఁడు ఇతఁడు నితని భార్యయు పేదదంపతులై యా యూరివారి దయవలనఁ గాపురము చేయుచుండగా, నతనిభార్య రాధ, ప్రసవించి పరలోక గతురాలయ్యెను. ఆమె పోయినప్పటి నుండియు గోపన్న బ్రదుకు మరియు బయటఁబడినది. అతఁడీపిల్లను బెట్టుకొని నెమ్మదిగా బ్రదుకుచుండెను. కొన్నాళ్ళాపసిదాని నెత్తుకొనిపోయి యాయమ్మదగ్గఱ నాయమ్మదగ్గఱ పాలిప్పించుకుని పిల్లను రెండేండ్లు వచ్చినప్పటి నుండియు నట్లే సాకుకొనుచుఁ గోపమువచ్చినప్పు డామెనుగొట్టుచుఁ దిట్టుచు దయవచ్చినప్పుడు 'తల్లీ! నీవే నాపాలిటి కల్పవృక్షమవు. తల్లీ! మీతల్లి చచ్చిపోవుచు నిన్ను నాకిచ్చిపోయినదే' యని వక్షమున కాపసిదానిని హత్తుకొనుచుఁ గాపురము చేయుచుండెను. గోపన్నకు నాలుగు స్వార్తపు ముక్కలయినను రాకపోవుటచే నతని బ్రదుకు దుస్తరముగా నుండెను.

రాధకుఁ జిన్నచిన్న పనులన్నియుఁ జేతనగును. హరశాస్త్రి రాధవంకనే చూచుచుండెను. గోపన్న లోపలనుండి వచ్చి హరశాస్త్రినిగూర్చి యూరుపేరడిగి యాతడు జ్యోతి

ష్కుడని సాముద్రిక వేత్తయని తెలిసికొని 'స్వామీ! మా రాధ చెయ్యిచూచి నన్నీమె యేమైనను బ్రతికించు నేమో చూడుడు' అనెను. రాధ తెల్లపోయి తండ్రివంక హరశాస్త్రి వంకఁ జూచెను. ఆ యింటి కెదురుగానున్న చెరువుమీఁదఁ దీతువుపిట్ట కూయుచుఁ బరుగెత్తెను. హరశాస్త్రి మీరు ముందు భోజనము కానిండని చెప్పెను.



# ఆఱవ ప్రకరణము



మహమ్మదుషాకు పట్టాభిషేకమై నాలుగేండ్లు గడచెను. సుల్తానునకుఁ బదునాలుగేండ్లువచ్చెను. ఈనాలుగేండ్లు జహాన్ అధికార మెక్కువై పోయెను. సుల్తాను రహస్యము జహాను తనచేతులలోఁ బెట్టుకొనెను. ఆ రహస్యము వారి యిద్దరిమధ్యనే నిలచిపోయెను. ఈ రహస్యము గవానునకును రాణికిని తెలియును కాని తెలిసి లాభములేకపోయెను. మహమ్మదుషా జహానుల యిద్దరిమధ్య నమ్మకము చెడనంత సేపు జహాను నేమియుఁ జేయరాదు. జహాన్ దాచిన పరిచారకుని సుల్తాను క్షమించెను. గవానునకు రాణికి నేమిచేయుటకును దోచలేదు. నాలుగేండ్లు జహాన్ రాజ్యముచేసెను. జహాన్ తన యధికారము క్రమక్రమముగా వృద్ధిచేసుకొనఁ జొచ్చెను. జహాన్ భోగము రాజభోగముకన్న నెక్కువయయ్యెను. సుల్తానువెంటఁ బదిమంది యంగరక్షకులుందురు. జహానున కిరువదిమంది. రాజ్యవిషయములలో గవానురాణుల మాట చెల్లదు. వీరన్నది జహాను కాదనును. సుల్తాను జహాను మాటనే చేయును.

రాణి యీ నాలుగేండ్లుగా సుల్తానుని ప్రేమ కొంత వరకు సంపాదించెను. అతనికి తానే భోజనముపెట్టును. అతనికి దాసీలను బహుమానముగాఁ బంపించును. తన నగలలో

నతనికిఁ గొన్ని నజరానా లిచ్చును. మాటిమాటికి నతనిని గౌగలించుకొని 'నాయినా! నీ తల్లిని నన్ను మరచిపోకు సుమీ' యని జోకొట్టును. ఇట్టి వానిచేత సుల్తానునకుఁ దల్లిమీదఁ గొంత నమ్మకము ప్రేమయుఁ గుదిరెను. జహాఁ తన తల్లికి తనమీదఁ బ్రేమ లేదన్నమాట యబద్ధముగాఁ దోఁచెను.

ఒక నాఁడంతఃపురములో సుల్తానును రాణియు గూర్చుండిరి. రాణి సుల్తాను దుస్తులలో మడతలు తీయుచు నతని మెడలో హారములు సర్దుచు "నాయనా! నైజాంషా కన్న నీవే సుల్తానుగా నుండఁ దగుదువు. అతఁడు నీయంత యందముగాని దర్జాగాని లేనివాఁడు" అనెను. సుల్తాను సంతోషించెను.

ఆమె మరల 'నైజాంషాకు నీవన్నఁ జాల ప్రేమయుండె డిది. అతఁడు రాజ్యము నీకే యీయవలెనని చాలసారులను చుండెడివాఁడు' అనెను. సుల్తాను తన యన్నగారిని గూర్చి జాలిపడెను.

రాణి మరల 'అతఁడు చనిపోవునప్పుడు నిన్నుఁ జూడ వలెనన్నాఁడు కాని జహాను సాహెబు చూడ నియ్యలేదు. పాపము! వానియాత్మ నిన్నుఁ జూడవలెనని యెంతయారాట పడినదో' యని కన్నీళ్ళు జార్చెను. సుల్తాను కరగిపోయెను. 'జహాను చాల దుర్మార్గుఁడు. నన్ను మాయన్న నేలచూడ నీయలేదు' అనెను.

'నాయనా! నీకు నీతల్లిమీఁద నీయన్నమీఁదఁ బ్రేమ లేకుండ జహా౯ కుట్రచేసెను. నాయనా! సుల్తానుకు మాత్రము తల్లితండ్రులమీఁదను నన్నదమ్ములమీఁదనుబ్రేమ యుండదా! నైజాంషాకునీమీఁద నెంతప్రేమయుండెడిది' అని రాణి యనెను. సుల్తానునకు జహానుమీఁద ననుమానము కలిగెను.

రాణి—నైజాంషాకు నాయందును బ్రేమ యుండెడిది. అతఁడునేనుచెప్పినట్లు నడచుకొనెడివాఁడు. అదిజహా౯నకు గిట్టినది కాదు. అందుచేత నైజాంషాను జహానుచంపించెను అతనిఁ జంపించి నిన్ను సుల్తానునుచేసినాఁడు. నిన్ను సుల్తానును చేయకముందు నామీఁద, నీయన్నమీఁద, నీకుఁ బ్రేమ లేకుండఁజేసినాఁడు. నీవునేనునొకటైనచో రాజ్యమంతయు నీదియేగదా! మంత్రియైన యతని కధికార ముండదు. నిన్నతఁడు కూడఁగట్టినచో నధికార మతఁడు చేయవచ్చును. నిన్ను మోసముచేసి నిన్నేదోబెదరించి నిన్నుతననైపునకుఁ ద్రిప్పుకొన్నాఁడు. సుల్తాను రాణి మాటలు నిజము లనుకొన్నాఁడు.

మరలరాణి యిట్లన్నది—'నైజాంషాను మీయన్నను నిన్నంతగాఁ బ్రేమించినయన్నను జంపి యా రహస్యము నాకుఁ దెలియనట్లు దాచుచున్నాఁడు. ఆరహస్యముతోనిన్ను తనచేతులలో నిరికించు కొన్నాఁడు. తండ్రీ! సుల్తానువు నీవైన నేమి మీయన్న యైన నేమి. కాని యిప్పుడు సుల్తాను జహా౯

నై నాఁడు. కిరీటముహారములు నగలునీవి. అధికారము జహా నుది. కిరీటము పెట్టుకొన్నవాఁడు కాదు రాజు. అధికారము చేసినవాఁడు రాజు. నీకంగరక్షకులు పదిమందియే. జహానునఁ కిరువది మంది. జనులందరు తమ పనులు అగుటకు జహానును జూడఁ బోవుచున్నారు గాని నిన్నుఁ జూచుటకు వచ్చుట లేదు. నీవునునేనునుమనోవృత్తి తినుచున్నట్లు తినుచున్నాము. జహాన్ రాజ్యము చేయుచున్నాఁడు.''

సుల్తానునకు తల్లిచెప్పిన ప్రతిపదము యదార్థ మని తోఁచెను. నైజాంషాను జహాను చంపించెనని రాణికిఁ దెలి యనే తెలిసెను. ఇఁకఁ దాను జహానునకు భయపడవలసిన పనిలేదను కొనెను.

రాణి మరల నిట్లుచెప్పెను. "నాయనా ! నీఅన్నగారి యాత్మ జహాను నెత్తురు చూడఁగోరు చున్నది. జహాను చచ్చినగానినీఅన్న యాత్మకునునా యాత్మకును సంతృప్తి లేదు. నీకు నిజమైన యధికారము లేదు. ఏమందువు?"

సుల్తానునకుఁ గోపము వచ్చెను. "అమ్మా! రేపుజహా నును నరకించెదను" అనెను. రాణి, నాకట్లు వాగ్దాన మిమ్మని ఖురానుమీఁద ప్రమాణము చేయించెను.

నాలుగు సంవత్సరముల క్రిందట జహాను చెప్పిన మాటలకుఁ జేసిన చేతలకు నేఁడు రాణిమాటలకు నామె చేత లకు సరిపోయినది. నవాబు తాను వానినిఁ బోల్చి చూచు

కొనెను. రాణికిసర్వము తెలిసినట్టు తెలిసిపోయెను. సుల్తాను మనస్సులోఁ జిత్ర విచిత్రములైన భావములు చెలరేగెను.

ఆరాత్రి సుల్తాను మరల నొక స్వప్నమును గాంచెను. జహాను, గవాను, తాను, తన యన్నయుఁ గలసి యొక కాలువవెంట నడచు చుండిరి. గవా నింతలో నెచ్చటికో పోయెను. జహా నా సందుచూచి తనయన్నను కాలువలోనికి ద్రోసెను. గవానువచ్చి జహానును నైజాంషా యేడి ! యని యడిగెను. జహాను తన్నుజూపి యితఁడే నైజాంషా యనెను. గవాన్ మరల మాట్లాడలేదు. గవాను తన్ను వెనుకకుఁ బిలచి 'సుల్తానుజీ! నీవు జహానునుకాలువలోనికిఁ ద్రోయుము. త్రోయకున్న నతఁడు నిన్నును నన్నునుగూడ గాలువలోనికిఁ ద్రోసి చంపును' అని చెప్పెను. అతనికి దారి తోచలేదు. జహాన్ తనను కాలువలోనికిఁ ద్రోయబోవుచున్న ట్లుండెను.

ఇంతలో సుల్తానునకు మెలఁకువ వచ్చెను. తెల్లవారినది. ఇదివరకు సుల్తాను తనకలలు జహానునకుఁ జెప్పెడివాఁడు. ఈకల జహానున కెట్లు చెప్పుట. అదియుఁగాక తనతల్లి వచ్చి యతనిఁ గౌగిలించుకొని 'నాయనా సుఖముగా నిద్రపట్టినదా! మీయన్న యెప్పుడును కలలు కనుచుండెడివాఁడు. నీకుఁ కలలు రావుగద' యనెను. సుల్తాను తన మనోదార్ఢ్య మీలాలనచేతఁ గరగిపోగా రాణి కీస్వప్నమంతయుఁ జెప్పెను.

రాణి యిట్లన్నది. "ఈ స్వప్నముశుభమైనదిగా లేదు. హోరశాస్త్రి యుండినచో నిట్టి స్వప్నముల కర్థము చక్కఁగాఁ

జెప్పెడివాఁడు. అతఁడు జహాను దుర్మార్గత్వమునకు జడిసివెడలి పోయినాఁడు."

సుల్తాను హరశాస్త్రిగి గూర్చి కొంచెముగా జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. "అమ్మా ఆ హరశాస్త్రి యిప్పు డెచ్చట నున్నాఁడు?" అనెను.

రాణి—తెలియదు ! అని చెప్పి గంగూహాసనుల స్నేహము, హరశాస్త్రి వెడలిపోవు నప్పు డనిన మాటలు చెప్పి హరశాస్త్రిని మరలఁ దెచ్చినఁ గాని రాజ్యము బాగు పడదని చెప్పెను. ఇప్పుడు సుల్తానునకు రాణిచెప్పిన ప్రతి పదము నచ్చుచున్నది. సుల్తాను హరశాస్త్రిని పిలిపింతున నెను. తరువాత నవాబు స్నానముచేసి భోజనముచేసి హారకిరీటా దులు ధరించి పరిచారకులు నుద్యోగులు వెంటరా సమస్త వైభవములతో సభా సదనమునకుఁ బోయి కొలువుతీరి కూర్చుండి యుండెను.

నవాబు కొలువునకుఁ బోయినది మొదలు రాణి జహానును చంపుటకుఁ దగిన వానిని వెదకుచుండెను. అధికార మంతయుఁ దనచేతిలో నుంచుకొన్న జహానును చంపుటకు మంచి సాహసుఁడు కావలయును.

బహమనీరాజుల యాస్థానములో మహమ్మదీయులు రెండు కక్షులుగా నేర్పడి యుండిరి. పర్షియానుండి వచ్చిన మహమ్మ దీయులకును దక్షిణాపథము నందలి వారికిని వైషమ్యములు ప్రబలియుండెను. పర్షియావారికి క్వాజామహమ్మదుగవాఁ

నాయకుఁడు. దాక్షిణాత్యులకు ఖ్వాజామహమ్మదు జహాన్ నాయకుఁడు. ఈ రెండు కక్షులవారు నొకరి యధికార మొకరపహరించు చుండిరని యొకరిపై నొక రసూయాపరవశులై యుండిరి.

ఇప్పుడు జహానును చంపవలయు ననినచోఁ బర్షియా దేశస్థుఁడు చంపవలెను. అట్లు చంపినచో దాక్షిణాత్యులందరును వానిమీఁదఁ బగబట్టెదరు. కావున నదిసాధ్యముకాదు. రాణి యూహించెను. ఔత్తరాహులలోన యొక సాహసి మహమ్మదీయుఁడు సుల్తానున కంగరక్షకులలో నొక డుండెను. రాణి వానిని బిలిచి యీపని చెప్పెను. నిన్ను నేను రక్షించెదననెను. సుల్తాను నాజ్ఞ కాగానే యీపని యాలస్య మించుకయు లేకుండఁ జేయవలె ననెను.

సుల్తాను కొలువులో నుండగా మహారాజువలెజహాన్ లోనికి వచ్చెను. అతనివెంట నంగరక్షకు లారోజున ముప్పది మంది వచ్చిరి.

సుల్తానున కనుమానము దృఢపడెను. కాని యతనికి వానిని శిక్షించుటకు ధైర్యము చాలకపోయెను. సభ యరగంట జరిగెను. సుల్తాను వెనుకాఁడు చున్నాడని రాణికిఁ దెలిసెను. ఆలస్యము జరుగరాదు నాఁడు దాటినచోఁ దన రహస్యము జహానునకుఁ దెలియవచ్చును. రాణి తొందరపడియొక పరిచారికను రాజునొద్దకుఁ బంపెను. అదిపోయి నవాబునకు సలాముచేసి 'జహాఁపనాహ్! మీతల్లిగారికి మీరు రాత్రిచేసిన

వాగ్దానము నెరవేర్ప నామె కోరుచున్నది.' అనెను. సుల్తాను నకు వెంటనే యావేశము కలిగి యొక్క యరపుతో జహాను వంకఁజూపించి 'వాఁడు! రాజద్రోహి! వానినివధింపు' డనెను అనుట యాలస్యముగా నాయాత్తరాహుఁడు జహాను మీఁది కురికిఁబట్టాకత్తితో జహానును రెండుగా నరకివైచెను. సభ యంతయుఁ గల్లోలపడెను. సుల్తాను నిలుచుండి రెండునిముస ములు జహాను తల మొండెము వంకఁజూచి సభ వెడలి పోయెను. ఔత్తరాహుఁడు సుల్తానువెంటఁ బోఁగా నతనివంక వెయ్యి తీక్ష్ణదృష్టులు నిగిడెను.

---

# ఏడవ ప్రకరణము



హరశాస్త్రి యాయుండిపోవుట యుండిపోవుట కొండపల్లిలోననే యుండిపోయెను. అతఁడు రాధను గోపన్ననువదల లేకపోయెను. ఒకచిత్ర మేమనగా రాధ జాతకముకాని రాధ సాముద్రికముగాని హరశాస్త్రి గోపన్నతో నొకసారియైనను చెప్పినాఁడుకాఁడు. రాధ కిప్పుడు పదియేండ్లు వచ్చినవి. రాధ మునుపటికన్న కొంచె మెదిగినది. రాధ కిప్పుడిద్దరు తండ్రులు గోపన్న కడుపునఁగన్న తండ్రి. హరశాస్త్రి కనులతోఁగన్న తండ్రి.

హరశాస్త్రికొండపల్లిలోనొక వర్తకునియొద్ద లేఖకుఁడుగా ప్రవేశించెను. ఆ వర్తకునకు హరశాస్త్రియం దమితమైన భక్తియేర్పడెను. అతఁడు హరశాస్త్రికి సాలునకు నాలుగు వందల నాణెము లిచ్చునట్లేర్పాటు చేసెను. హరశాస్త్రికిఁ బనియులేదు పాటలేదు. ఎప్పుడైన వారియింట పురాణము చదువుట. నాటికిఁ గోటికి నుత్తరములు వ్రాయుట. పిల్లలకు జాతకములు చెప్పుట. హరశాస్త్రిపనియిది. హరశాస్త్రి తల్లి మోరుగల్లులోఁ జనిపోయెను. హరశాస్త్రి మోరుగల్లునకుఁ బోయి తల్లి పరలోక క్రియలు సుష్ఠుగా జరిపెను. ఆవర్తకుఁడు హరశాస్త్రి తల్లి పరలోక క్రియలకు రెండునందల టంకము లిచ్చెను. ఓరుగల్లులోని యొక బ్రాహ్మణుఁడు తనకూఁతును

హరశాస్త్రి కిత్తునవెను. హరశాస్త్రి తనకుఁ బెండ్లివయసు మీఱినదని నిరాకరించెను. హరశాస్త్రి భోజనము కొండపల్లి సత్రములో. ఆసత్రమునందున బ్రాహ్మణికి హరశాస్త్రిసాలునకు రెండువందల నాణెము లిచ్చునట్లు నిర్ణయించుకొని యచట భోజనము చేయుచుండెను. భోజనము సత్రములో. నిద్ర గోపన్నయింటిలో.

రాధ కిప్పుడు తమయింటిలో నన్నిపనులు చేయుట చేతనైనది. అన్నమువండి తండ్రికిఁ బెట్టును విస్తళ్లు కుట్టును. ఇంటిపని యంతయుఁ జేసికొనును. తనకుఁ గావలసినవి హరశాస్త్రి యుద్యోగముగాఁ గుదిరిన వర్తకుని యింటికిఁ బోయి తెచ్చుకొనును. వారు రాధ యేమడిగిన నది యిత్తురు. హరశాస్త్రి యామెను బిడ్డవలెఁ జూచుకొనుటచేత నూరందరికి రాధ యనిన నభిమానము హెచ్చెను. ఆమె కిప్పుడు కొరత లేదు. రాధ యిప్పుడు ముచ్చటకన్న నోడలు చేసినది, ఎత్తు పడినది. పరికిణీ మాయనీయదు. తల చెరగనీయదు. పదేనిమిదేండ్లుగా నూనె యెఱుగని యామెతలవెండ్రుకలు నూనె కెదురు తిరుగును. కాని దువ్వెన కెదురుతిరుగ లేక యణగి యుండును. రాధ నీలేరుగాజులు పెట్టుకొని బందరు కలంకారి పరికిణీరైకలు తొడుగుకొని కన్నె ముత్తైదువుగాఁ బేరంటమునకు వెళ్లినప్పుడు నగలు లేకున్నను నందరికన్ను లామె మీఁదనే యుండును.

హరశాస్త్రికి రాధకుఁ బెండ్లిచేయవలెనని పట్టినది. అతఁడొకనాఁడు సంబంధమువిచారించుటకమరావతిపోయెను. ఆనాఁడు బైరాగి యొకఁడు గోపన్న యింటికివచ్చి రాధను చూచి యామెయడుగగా నామెచేయి చూచెను. అతఁడామె చేయి చూచిచూచి పెదవివిరచి పోయెను. రాధ వాని నేల పెదవి విరిచెనో చెప్పుమని తొందరపెట్టెను. కాని వాఁడు చెప్పకుండనే తిరిగి పోయెను. రాధ కేమియుఁ దోచలేదు. ఆనాఁడు వంటయంతయుఁ బాడుచేసెను. గోపన్న భోజనము ముందు విసుగుకొనెను. 'అమ్మా! మీ పినతండ్రి యూరులో లేఁడనియా వంట యిట్లు చేసితివి' అనెను.

రాధ భోజనమైన తరువాత బైరాగి వానిని వెదకు కొనుచు నూరువెంటఁ బోయెను. వాఁడూరిచివర నొకచోటఁ గూర్చుండి గంజాయిపీల్చుచుండెను. రాధవానియొద్దకుఁబోయి 'నాచేయిచూచి యిందాకఁ బెదవి విరిచితివి కదా! నాచేయి చూచి నా జాతకము చెప్పు'మనెను, వాఁడు 'మంచి భాగ్యశాలివే తల్లి మంచి భాగ్యశాలివి. నీకు గొప్పదశ పట్టును' అనెను. రాధకుఁ దృప్తికలుగలేదు. వానిని తరచి తరచి యడుగ మొదలుపెట్టెను. వాఁడుచివరకు దగ్గఱకురమ్మనిచేయి చాపుమని చేయి పరిశీలించి యిట్లనెను. 'అమ్మా! నీవు బీదరాలవు. నీభర్తకూడ బీదవాఁడేయగును. నీకుఁ బండ్రెండవ యేటఁ బెండ్లియగును.' అని చెప్పెను. రాధ పెదవి విరచిన దెందుకో చెప్పుమనును, వాఁడు చెప్పలేదు. రాధ వానిని

పీడించెను. 'తల్లీ! నీకు పదునేనవయేట గండమున్నది. కాని యది దాటిపోవు'న నెను. రాధకుఁ దృప్తికాలేదు. అతనిదగ్గరకు మరికొంచెముజరిగి 'తాతా! అదికాదు నిజముచెప్పుము' అని యడిగెను. బైరాగి యాలోచించి తల్లీ! ఏమైనను సరే చెప్పుచున్నాను. అశుభము చెప్పరాదు. అయినను నీవింతగా పట్టుపట్టితివిగానఁ జెప్పుచున్నాను. నీకు పదునేనవయేట గండములేదుకాని యేదో యొకవిచిత్రమైన యాపద రానున్నది. బాగుగా నాలోచించినచో నీభర్త నిన్ను వదలిపెట్టవచ్చును. కాని నీ హస్తమందేదో వక్రరేఖయున్నది. తల్లీ! అదినాకు తెలియుటలేదు. ఆగీత యర్థమేమో తెలిసికొనవలెననినాకును నూహగా నున్నది. నేను బ్రతికియుంటినా నీ వెంటనే తిరుగుచుందును. ఆగీత నే నెక్కడజూడలేదు. ఆగీత యర్థమేమో తెలిసికొనుటకీ వైదేండ్లును నీ వెంటనే యుండెదను. మాటిమాటి కీయూరు వచ్చుచు పోవుచుందును. వచ్చినప్పుడెల్ల నిన్ను చూచుచుందును' అనిచెప్పెను. రాధ యతనిని వాని పేరడిగెను. వాఁడు 'రాంబైరాగి'యని చెప్పెను. బైరాగితన సంచిలోనుండి యొక మూలికతీసి రాధకిచ్చి 'నీవిది యెప్పుడును మెడలో కట్టుకొనుము. నేను పదిరోజులలో బయలుదేరి కాశికిఁ బోవుచున్నాను. హిమాలయ పర్వతములలోఁ గొన్నిమూలికలు వెదకుటకై పోవుచుంటిని. నేను తిరిగి సంవత్సరమైనతరువాత వచ్చెదను. వచ్చినప్పుడు నీకింకొకమూలిక యిచ్చెదను. అంతవరకు నీవు దీనిని ధరించుము. అది తెచ్చిన

తరువాత నీవది ధరింతువుగాని' యనిచెప్పెను. రాధ యెడల రాంబైరాగి కేలనో వృథాకరుణ బుట్టినది. రాధ యా మూలిక తీసికొని యింటికిపోయెను.

మరునాఁడు హరశాస్త్రి యింటికిఁ దిరిగివచ్చెను. రాధ జరిగిన కథయంతయు నాయనతోఁ జెప్పెను. హరశాస్త్రి యాశ్చర్యపోయెను. ఆ బైరాగిని తనకుఁ జూపించుమని యడిగెను. రాధయు హరశాస్త్రియుఁగలసి యూరంతయుఁదిరిగిరి కాని బైరాగి కనంబడలేదు. రాధ హరశాస్త్రితో 'బాబూ! వాఁడు చెప్పినది నిజమేనా' అని యడిగెను. హరశాస్త్రి 'తల్లీ! నిజమే, నీచేతిలో విచిత్రమైన వక్రరేఖ కర్థమేమో నాకును దెలియలేదు. అందు కనియే నేను రాజమహేంద్రవరము పోదమనుకొన్నవాఁడ నిచ్చటనే నిలచిపోతిని. ఇంక నైదేండ్లలో నా గీతఫలము దెలియును' అనెను. రాధ 'ఆగీత మంచిదా! చెడ్డదా! యని' యడిగెను. హరశాస్త్రి మంచిదిగాఁ గనంబడుచున్నదికాని దాని యాథార్థ్య మిట్టిదని చెప్పరాదనెను. రాధ కొక విధమైన యానందము కలిగెను. తనకేదో గొప్పదశ పట్టునని యనుకొనెను. ఆనాఁడు సాయంతనమున రాధ ! వారియింటి కెదురుగానున్న చెరువుగట్టున నంట్లుతో మాటుకొనుచు సూహావిహార సూహగాఁ దనకు మహైశ్వర్యము కల్గుననియుఁ గొండపల్లికోటకుఁ దాను రాణియగుదు ననియు ననుకొని కోటవంకఁ జూచెను. కాలుచాచినట్లు దక్షిణమునకు పడవాలుగా వ్యాపించిన యాకొండ దరియు రాధ

వంక భయంకరముగాఁ జూచెను. ఆ కొండప్రక్కలఁ బెరిగిన చెట్లు పర్వతమునకు సహజమైన గాంభీర్యమును వెల్లడించెను. రాథ ప్రక్కగా నొకవాగు జరజర నడచిపోయెను. కొంచె మైనచో నామెను గరచెడిదే.

## ఎనిమిదవ ప్రకరణము

క్వాజామహమ్మదు జహానును సుల్తానుచంపించిన తరువాత నాలుగేండ్లకు ననగా 1471 సంవత్సరములో నొకనాఁడు వేగిలోఁ బగలు పన్నెండుగంటలు దాటిన తరువాత నొక యాత్రికుఁడు కొండపల్లి చేరెను. అతఁడు గొప్ప వంశము వాఁడువలె గనంబడు చుండెను. కాని మొగ మెండ చేతను మాత్రమే కాక దైన్యముచేతఁ గూడ వాసినట్లు కనఁబడుచుండెను. అతఁడు కొండపల్లి వచ్చి సత్ర మెక్కడ నున్నదని యడిగి సత్రమునకుఁ బోయెను. అక్కడ భోజనము చేసెను. భోజనము చేయుచుండగా సత్రపుటవ్వ యాయనతోఁ బ్రసం

గము సాగించెను. ఆమెకావేళ గానివేళ భోజనము చేయువా రెవ్వరు లేనందునఁ దీసుబడి కలిగి యాతనితోఁ బ్రస్తావించుటకు వీలయ్యెను.

అవ్వ—'అయ్యా! మీ పేరేమి?'

ఆతఁడు మాటాడలేదు. అవ్వ మరల నదే ప్రశ్నించెను. ఆతఁడు కూరకలుపుకొని నేయియడిగెను. అవ్వ నెయ్యి యెక్కువగాఁ జారఁబోసి మరల నదేప్రశ్న యడిగెను.

ఆ—మాది కటకము. కొంచెము కూర వడ్డింతురా!

అవ్వ కూర వడ్డించెను. మరల నేయివేయఁబోయెను. కాని యాతఁడు వలదనెను. అవ్వ 'మీ పేరే'మనియడిగెను. అతఁడు మాటాడలేదు. అవ్వ పులుసుపోసి ముక్కలు రాచిప్పలో నున్నవన్నియు నాతని విస్తరిలోననే వడ్డించి 'అయ్యా! బెండకాయ ముక్కలు మీ కిష్టమేనా' యని యాతడిష్టమే యనగా 'నున్నముక్క లన్నియు వేసితిని కడుపునిండ తినుబాబు! ప్రొద్దుదాటి వచ్చితిరి. గొప్పయింటి బిడ్డవువలెఁ గనంబడుచుంటివి. ఏదో మాయదృష్టము కాక పోయిన మీవంటి వారు బసల కెందుకువత్తు' రనెను.

ఆ—మీ యదృష్టము. మా దురదృష్టము.

అవ్వ—ఏమి! బాబూ! అట్లంటిరి! భోజనముబాగుగా లేదా! అట్లయిన నాపేరు జిల్లిగవ్వ యూరుకొనదు. మీరు రాత్రి గూడ నుండుడు. మీ కిష్టమైన పదార్థము లేవో చెప్పుడు.

చేసి పెట్టెదను. బాబూ! భోజనము ముందర మీరు రుసూరు మనినచో నాకది తగులును.

ఆ—(నొచ్చుకుని) అమ్మా! అదికాదు: భోజనము చాల బాగున్నది. అది నా పొద. మీకు సంబంధము లేని మాట. ఆశ్వికుని గాంభీర్యము ముసలిఅవ్వ దయచేత కరగినది.

అవ్వ—నాయనా! ఏదో కష్టములోనున్నావు కాబోలును. కష్టములుకాక యీ ప్రపంచములో సుఖము లున్నవా! ఓర్చుకోవలయును. కష్టములు శాపురమును చేయవు. మంచిరోజులు నీకును వచ్చునులే.

అవ్వ కాతనియందు దయగలిగి తనకై అట్టిపెట్టుకొన్న పెరు గాశ్వికు డెక్కువన్న కొలది యాతని విస్తరిలోఁ గుమ్మరించెను. ఆతని మనస్సు ముసలియామె యెడలసమా ర్ద్రమై పోయెను. అతఁడు 'పెరుగెక్కువ పోసిరి, నేను తినలే' ననెను.

అవ్వ—'నాయనా! అస లన్నమే తినలేదు. ఎండలో నడచినవారి కన్న మేమి సయించును. కడుపునిండ నీళ్ళేపోసితివి. ఈ పెరుగన్నము తినుము. చలవ చేయును. బాబూ! మీరు సంతోషించుటయే నాకుఁ గావలసినది. ధన మేమి శాశ్వతము.' ఆశ్వికుని మనస్సు అవ్వకు వశమైపోయెను. అవ్వ నాయనా మజ్జిగలోనికి లవణము కావలయునా యని యాతఁడు వద్దనగా 'మీ పేరేమి' యనెను.

ఆ—అంభోజరాజు.

అవ్వ—అయ్యో! నాయనా మీరు క్షత్రియులా! మీ కిక్కడ వడ్డించితిని. బాబూ! నాకా సంగతి తెలిసినచో వేరేగదిలో వడ్డించెడిదానను. నాయనా మీకళ్ళ మీయజ్ఞో పవీతము చూచికూడ నాకుఁ దెలివిలేక పోయినది. మీరు చెప్పనైన చెప్పితిరికాదు. బాబూ! క్షమింపుము.

ఆశ్వాసన కవ్వ సాక్షాత్తు కాశిఅన్నపూర్ణ యనిపించెను. పొగక్త్తల కెవని మనస్సు కరుగదు!

అవ్వ—బాబూ! మీ రేయూరు పోవుచున్నారు?

ఆ—అహమ్మదాబాదు.

అవ్వ—ఏమి పనిమీద? మనబసలో హరశాస్త్రిగా రనియున్నారు! ఆతనిది పూర్వ మహమ్మదాబాదే అక్కడ నాయన నవాబులదగ్గర యుద్యోగి యట. మీ కేదైన వర్త మానము కావలసినచో నాయనచేతఁ జెప్పించెదను.

అంభోజునకు నవ్వ మంచితనమునకు నాశ్చర్యము వేసెను. ఇంతలో నాయన భోజనము పూర్తి యయినది. లేచి గుఱ్ఱమునుకట్టివేసినచోటికిఁ బోయి కొన్ని దుస్తులు తెచ్చి యొక గదిలోఁబక్క వేసికొని పండుకొనియెను. వేసఁగి వేడికి నలయుటచేత నాతనికి నిద్రపట్టెను. అతఁడు మేలు కొనునప్పటికిఁ గాకులు కూయుచుండెను. ఆతఁడు లేచి చెరువు దక్షిణమున నున్నదని కనుగొని యుచటికిఁ బోయి కాలు సేతులు కడిగికొని వార్చికట్టమీద నిలంబడెను. ఆవేళకు

హరశాస్త్రి గోపన్న యింటినుండి చెరువునొద్దకుఁ బోయి సాంధ్యకృత్యములు చేయ మొదలుపెట్టెను.

అంభోజ రాజునకు హరశాస్త్రి యీతఁడే యేమో యనిపించినది. కాని రాజకీయ పలుకరించ నీయలేదు. హరశాస్త్రి చెరువులోనుండి బయటకువచ్చి రాజునుజూచి—'అయ్యా! క్షత్రియులవలె నున్నారు. తమరి దేగ్రామము?' అనెను. రాజు గంభీరముగాఁ గటకమని చెప్పెను. హరశాస్త్రి కటకమునకుఁ బోవుచున్నారా యనెను.

అం—కాదు. కటకమునుండియే వచ్చుచున్నాను. బీదరునకుఁ బోవుచున్నాను. హరశాస్త్రిగారిని మీరెరుగుదురా?

హ—అయ్యా! నేనే హరశాస్త్రిని. నాతో మీకేమైన పనిగలదా ?

అం—అయ్యా ! తమరు పూర్వము బీదరు నవాబుల యొద్ద నుద్యోగులటకదా ! అచటివర్తమానములు తమవలన దెలిసికొనవలెనని యూహపడి యడుగుచున్నాను.

హ—'అయ్యా ! పట్టి యుద్యోగినేకాదు. వారు బ్రాహ్మణ సుల్తానులని తమకు తెలియునుకదా ! వారుమూల పురుషుఁడైన అల్లాఉద్దీన్ హసన్‌షా నవాబైనది మాపూర్వుఁడైన గంగూబ్రాహ్మణునిదయవలననే. అప్పటినుండి యానవాబులకును మాకును వంశక్రమాగతమైన స్నేహమున్నది. కాని కడచిన సుల్తాను దానికి సున్న చుట్టెను. పైగా నావంశ

ములో హత్యలు దురాశలు ద్వేషములు ప్రబలిపోయినవి. నాకు విసుగుపుట్టి యచ్చటినుండి లేచి వచ్చితిని?

అంభోజరాజు 'స్వామీ! నేను బీడకునకు గొప్పపని మీదఁ బోవుచున్నాను. మీరు నాకు సాయము చేసినచో సంతోషించెద'ననెను. హరశాస్త్రి తనకుఁజేతనైన దైనచో నభ్యంతర మేమియు లేదనెను. అంభోజనుఁడు తాను హర శాస్త్రి భోజనము చేయు బసలోనే దిగితిననియుఁ దనసంగతి భోజనమైన తరువాత మనవి చేయుదుననియు చెప్పి యాతనిని దీసికొని పోయెను.

గుఱ్ఱమునకు మాలీసు చేయుటకు మేత వేయుటకు నెవ నినో కుదిర్చి రాజు గుఱ్ఱమును చూచుకొనివచ్చి స్నానము చేసి యవ్వ యెక్కువ శ్రద్ధతో వడ్డించగా భోజనము చేసెను. రాత్రి జాముప్రొద్దుపోయి అంభోజరాజును హరశాస్త్రియుఁ జెరువు గట్టుమీఁదికిఁ బోయిరి. శుక్లాష్టమి వెన్నెల కాయు చుండెను. చెరువుగట్టుమీద నిర్జనముగానుండెను. హర శాస్త్రి తన పనియేమియని కదలించెను. అంభోజుఁడు మొదలు పెట్టెను.

అం—అయ్యా! నేనోఢ్రగజపతికి సమీపబంధువు నగుదును. నేను గజపతి యప్పగారికిఁ గూతుఁ బిడ్డను మంగళరాజను నొకఁడు కలఁడు. అతఁడు రాజుగారిభార్యకు మేనమామ మనుమడు. నేను గజపతికి రక్తసంబంధిని. ఇట్లుండగా రాణియొక్కయు నామెకిష్టులైన కొందరు పాత్రుల

యొక్కయు కుట్రవలన నాహక్కులు త్రోసివేయఁబడి మంగళ రాజు రాజు చేయఁబడెను. నాకుఁ గుమ్మకు్క లేకపోయినది. ఆలోచించి భామిని సుల్తానుల సహాయము తీసికొని నారాజ్యము నేను సంపాదింతునని పూనితిని. మొట్ట మొదట మీపేరు విన్నప్పుడు మీరు నాకు బీదరు వర్తమానములు మాత్రమే చెప్పుదు రనుకొంటిని. మీరు మీకథ చెప్పిన తరువాత నా యాశలన్నియు మీ మీదఁ బెట్టుకొంటిని. మీరు నన్ను బీదరునకుఁ దీసికొని పోయి నవాబుల దర్శనము చేయించినారాజ్యము నాకిప్పించవలయునని ప్రార్థన. బ్రాహ్మణులు క్షత్రియుల ప్రార్థన త్రోసివేయ రాదని నామనవి.

హర—అయ్యా! నేను సుల్తానులతోఁ దగాదాపడి వచ్చితిని. మరల వారియొద్ద కెట్టు పోదును.

అం—ఒక స్నేహితుని పని సానుకూల పరచుటకు.

హర—ఇప్పటి సుల్తానును నే నెఱుఁగనే యెఱుఁగను. నే నెఱింగిన సుల్తానును పసివాఁడుగానున్నప్పుడే కూనీ చేసిరి.

అం— అయ్యా! తమరక్కడ మంత్రుల నెఱిఁగియుందురు కదా!

హర—ఇద్దరిలో నొకనికి నాకు విరోధమే యనిచెప్పవచ్చును. కానియతనిని సుల్తాను రాజద్రోహియని చంపించెనని వింటిమి.

అం—ఇంక నేమి? మిగిలినవారు తమరికిమిత్రులేక దా! వారిని మీరు భాగుగా నెరుగుదురు.

హర—దానికేమి. రాణిగారిని మాత్రి మెఱుఁగనా! ఈ కుఱ్ఱ సుల్తానును నే నెరుఁగను. ఇప్పటి కాతఁడు పదునెన్మిది పందొమ్మిదేండ్ల వాఁడుగా నుండును. ఇంక నేను మీ యూరు రానని చెప్పి వచ్చితిని. మరి యిప్పుడెట్లు పోదును.

అం—ప్రతిజ్ఞ చేసితిరా! హర—చేయలేదు కాని యంతమాట యంటిని. అదికాక నేనువచ్చి సుమా రేనిమిదేండ్లయినది. ఈయూరు వచ్చియె యాతేండ్లు దాదాపుకావచ్చు చున్నది. నేనువారికి జ్ఞాపకముందునా !

అం—అయ్యా! గవానంత మేధాశాలి శౌర్యవంతుఁడు లేఁడని ప్రతీతి. ఆతఁడు మిమ్మిప్పుడే మరచిపోవునా! మీరొక దీనుని రక్షించుటకు బద్ధసంకల్పులైతిరేని నా కార్యము ఫలించినట్లే.

అంభోజనుఁడు హరశాస్త్రికి నమస్కారము చేసెను. హరశాస్త్రి మొగమోట పడెను. రాజు రెండుచేతులు పుచ్చుకొని హరశాస్త్రి 'అయ్యా! మీకోసము నా పట్టుదల వదలెదను' అనెను. అష్టమిచంద్రుని ధాన్యపుగొమ్ము క్రిందుగా ధనపుఁగొమ్ము పైగా నస్తమించబోవు చుండెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

అంభోజనహరశాస్త్రు లిద్దరును బీడను చేరిరి. బీడను లోని చాలమంది జనులు హరశాస్త్రిని చూచినంతనే పూర్వ స్నేహమును వెల్లడించిరి. హరశాస్త్రి తన యింటికిఁ బోయి చూచుకొనెను. ఆయిల్లు పాడుపడి యుండెను. ఆస్థలము కొద్ది మొత్తమునకమ్మివేసి హరశాస్త్రి బీడునకుఁబోయినందులకు స్వలాభము కలిగించుకొనెను. ఒకనాలుగైదు రోజులయిన తరువాత హరశాస్త్రి యంభోజనుని వెంటఁబెట్టుకొని గవాను నింటికిఁబోయెను. గవాను హరశాస్త్రి వచ్చినాఁడనినతోడనే తానే బయటికి వచ్చి యాతనిని లోనికిఁ దీసికొని పోయెను. గవానునకు హరశాస్త్రి యకల్మషతయు తన నవాబులయం దాతనికిఁ గల గాఢాభిమానమును తెలియును. అందుచేత హరశాస్త్రి యన్న గవానునకు గౌరవము. అన్యోన్యకుశల ప్రశ్నలయిన తరువాత హరశాస్త్రి జహాను మరణమును గూర్చి ముచ్చటించెను. గవానాసంగతి యంతయుఁ జెప్పెను. హరశాస్త్రికి నైజాంషా పేరు చెప్పినంతనే కనుల నీరుగ్రుక్కుకొనఁ దిరిగెను. దానితో గవానునకు హరశాస్త్రి మీఁదఁగల సదభిప్రాయము రెండింతలయ్యెను. ఇదియయిన తరువాత సంభోజుని కథ హరశాస్త్రి గవానుతోఁ జెప్పెను. హరశాస్త్రి యందు సుముఖుఁడైన గవాను, వెంటనే హరశాస్త్రి చెప్పిన

దానికి సమ్మతించెను. కాని సుల్తానుతో నీ సంగతి చెప్పవల యును. సుల్తానున కీ సంగతి చెప్పుట కింకను రెండు రోజులు పట్టునని గవాను చెప్పెను.

హరశాస్త్రి రాణిని చూచుటకుఁ గోరెను. ఆనాఁడు సాయంతనము హరశాస్త్రియు గవానును రాణి దర్శనార్థమై పోయిరి. హరశాస్త్రిని చూచిన వారందఱు నవనివంక నిదానించి చూచుట గుర్తుపట్టుట మందహాసముతో సలాము చేయుటయు మొదలుపెట్టిరి. కాని మంత్రి వెంట వచ్చుట చేతఁ బలుకరింప వలసిన వారెందరో పలుకరింపలేదు.

రాణిహరశాస్త్రిని చూచెను. ఇరువురును సలాములు చేసికొనిరి. రాణికనపడినందులకు హరశాస్త్రి యెంతసంతో షించెనో హరశాస్త్రిఁ కనపడినందులకు రాణియంత సంతో షించెను. రాణి యతఁడు వెళ్లిపోయిన తరువాత జరిగిన కథ లలోఁ గొన్నికొన్ని ముక్తసరిగా సూచించెను, కొంతసే పయిన తరువాత హరిశాస్త్రి సెలవుతీసికొని లేచెను. రాణి "శాస్త్రిజీ! తమరు బహ్మనీసుల్తానులను వదలి పోవుటకు రాలేదు కదా! రేపు ప్రొద్దున దయచేయుఁడు. మీయుద్యో గము మీరు చేయవలసి యున్నది. పని మిగిలి యున్నది" అనెను. గవానునవ్వెను. హరశాస్త్రి యంగీకారముతో విన యమున జోడించెను.

ఆ మరునాఁడు హరశాస్త్రి యొక్కఁడు పూర్వపు రీతిగా సెలువ కప్పుకొని రాజ భవనమునకుఁ బోయెను.

రాణియు మహమ్మదు షాయును హరశాస్త్రి కొఱకెదురు చూచుచుండిరి. మహమ్మదుషాకప్పుడు పందొమ్మిదేండ్లువచ్చి నవినిత్యవ్యాయామమువలననాతనిమూర్తి యాజానుబాహువై కండలుదేరియుండెను. మీసములకు చిన్నగడ్డమునువచ్చెను. కన్నులు రక్తములైయుండెను. చూచుటకు భయంకరముగ నుండెను. హరశాస్త్రిని నవ్వుచుఁజూచి సుల్తాను 'భాయీ!' అని పిలచెను. అల్పసంతోషియగు హరశాస్త్రి కా పిలుపు నైజాంషా బ్రతికివచ్చి తన్నుపిలిచినట్లుండెను. కొంతమాటాడిన పిదప నైజాంషా మృతిమొదలుగా మహమ్మదుషా కన్న కలలన్నియు హరశాస్త్రికి రాణి చెప్పించెను. హరశాస్త్రి వానికి వ్యాఖ్యానములు చెప్పెను. మహమ్మదుషా చేయిచూచి యతనికి కొంతభూతము కొంత భవిష్యత్తును చెప్పెను మహమ్మదుషా యతని జోస్యమునకుఁ దమ వంశము నాడతనికిగల భక్తికిఁజాలసంతోషించెను. చివరకుమహమ్మదుషా 'శాస్త్రిజీ! మీరుమాయొద్దనే యుండవలయును. మనసంధి చెడిపోలేదు, జహాను సంధి చెరుపుటకెవరు? కావున మీరు మరల నహమ్మదాబాదులోననే యుండవలయు'ననెను. శాస్త్రి చిత్తమనెను. హరశాస్త్రి తాను వచ్చినపని సుల్తానుతో రాణితో విన్నవించెను. విన్నవించి హరశాస్త్రి యిట్లు చెప్పెను. "ఇందులో మనకుఁ గొంత లాభమున్నది. సంభోజునకు గజపతుల రాజ్యమిచ్చి, దానికి బదులుగా మనము రాజమహేంద్ర కొండపల్లి దుర్గములను గెలుచుకొనవచ్చును. తరు

వాత వీలుగానున్నపుడు మచిలీబందరుకూడ గెలిచినచోఁ కృష్ణా గోదావరుల మధ్యనున్న రాజ్యమంతయు బహ్మనీ సుల్తానుల దగును. శత్రువులకు సమలొత్తుకొని వచ్చుట కష్ట పెట్టును." రాణికి సుల్తానునకు నీయాలోచన నచ్చినది. హర శాస్త్రియందు రాణికిగల సద్భావము వృద్ధి యయ్యెను. పూర్వము హరశాస్త్రినిగురించి రాణి సుల్తానునకు మంచివాఁడని చెప్పుచుండెడిది. సుల్తానున కా మాట యథార్థ మని పించినది.

ఆ మరునాఁడు నిండుకొలువులో సుల్తాను హరశాస్త్రిని క్రొత్తసరదారు లందరికిఁజూపి యాతని యెడల తనకుగల మైత్రినివెల్లడించెను. అంభోజుఁడు సుల్తానునకు సలాముచేసి యుచితాసనమునఁ గూర్చుండెను. సభాముఖమున నంభోజుని వచ్చినపని హరశాస్త్రి సుల్తానుతో విన్న వించెను. సుల్తాను గవానుతో జెప్పెను. సుల్తాను అంభోజునకు రాజ్య మిప్పించుట కొప్పుకొనెను. సభయంతయు నంగీకరించెను.

కాని సైన్యమును మంగళరాజు మీఁదికి నడిపించుట కెవ్వరని ప్రశ్న వచ్చినది. గవా నాలోచించెను.

మాలిక్ హాసన్ ఖైరియను నొకయువకుఁడు యుద్ధము లందు సైన్యములు నడపుటయందు సమర్థత చాల సారులు కనఁబఱచెను. అతని యెడలగవానునకు మంచియభిప్రాయము కలదు. గవా నీసమయమున నతనిని సుల్తానునకు విన్నవించెను. సుల్తా నంగీకరించెను. ఆనాఁటిసభలో హాసన్ ఖైరికి

నైజాముల్‌ముల్కు అని బిరుదిచ్చితిమని సుల్తాను చెప్పెను. ఒక మణులుపొదిగిన పిడిగల కత్తి సుల్తాను హాసన్‌ఖారికి బహుమానము చేసెను. హాసన్‌ఖారి ముందుకువచ్చి సుల్తాను నకు వంగి నమస్కారముచేసి కత్తి స్వీకరించి యీకత్తితో సుల్తానునే సేవించెదనని ప్రమాణముచేసి సుల్తాను అంగీచివరలు ముద్దిడుకొని తన చోటికిఁ దాను పోయి కూర్చుండెను. అంభోజరాజు రాజ్యము తిరిగి యతని కిప్పించుటకై నైజాముల్‌ముల్కును పంపుచున్నామని సుల్తాను సభాముఖమున చెప్పెను. హరశాస్త్రి తాను మరలఁ గొండపల్లి పోవుటకు సుల్తాను సెలవు తీసికొనెను. అక్కడఁ దనకుఁ గొన్నిపనులున్నవని యవి సద్దుకొని తిరిగి వత్తునని యతడు చెప్పెను.

మరునాఁడుదయమున నైజాముల్‌ముల్కు ఇరువది వేల గుఱ్ఱపుదళముతో నాంధ్రదేశము మీఁదికి దాడి వెడలెను. అంభోజరాజు హరశాస్త్రి యీ సైన్యమువెంటఁ బోయిరి. ఆసైన్యము పదిరోజులలో గజపతుల దేశము చొచ్చెను. కటకము పోయి ముట్టడించెను. మంగళరాజు నైజాముల్‌ముల్కు సైన్యపుదాడి కాగలేక పారిపోయెను. అంభోజరాజు రాజయ్యెను. అంభోజరాజు తన కృతజ్ఞత వెల్లడించుటకు రాజమహేంద్రవర దుర్గము కొండపల్లి దుర్గమును గెలిచి మహమ్మదుషా కిచ్చెదనని చెప్పెను.

మొట్టమొదట రాజమహేంద్రవరము మీఁదికిఁ బోయిరి. ఆదుర్గ మాంధ్రగజపతుల సేనానాయకుఁ డొకని

క్రిందనున్నది. అతనిని కోట స్వాధీనము చేయుమనగాఁ జేయలేదు, నైజాముల్ ముల్కు నాలుగురోజులు ముట్టడివేసి యైదవనాఁడు తనసైన్యములను పురికొల్పికోటలగ్గల కెక్కించి లోనున్న కొద్దిసైన్యమును యథాయథలు చేసెను. కోట స్వాధీనమైన తర్వాత నచ్చట రెండువేల సైన్యములు నిలవ యుంచి తక్కిన సేనతో సంభోజుని సాయముతో గోదావరి దాటి కొండపల్లి కోటను పట్టుకొనుటకు రెండు రోజులలో వచ్చి చేరెను. కాని కొండపల్లికోట రాజమహేంద్ర దుర్గము వలె సులభసాధ్యమైనది కాదు. కోటకుమూఁడు నెలలుముట్టడి వేయవలసి వచ్చెను. సైన్యముల మూలముగా నూరిలోని ప్రజల కొత్తిడియయ్యెను. కాని హరశాస్త్రి వలనఁ గొండ పల్లి ప్రజలు నిర్భయులై యుండిరి. అదివరకే హరశాస్త్రి యనినఁ గొండపల్లి జనులకు భక్తి ఇప్పుడిట్లు సైన్యములు తెచ్చుట రాజులను నిలుపుట చూచినంత నాతనికి సుల్తాను వశుఁడని యాత డెట్లు చెప్పిన సుల్తా నట్లు నడచునని చెప్పుకొన సాగిరి.

తిను పదార్థము లయిపోయి కోటలోనివారు సంధికిఁ దిగిరి. నైజాముల్ ముల్కు కోటతలుపులు తెరపించి కోట వశము చేసికొని పూర్వమున్న యాంధ్రసైన్యములను సైన్య ములోననే యుంచి యా సరదారులను గూడ వారివారి యుద్యోగములందే యుంచి కోటకు నధికారము మహమ్మ దీయ నాయకున కొకని కిచ్చి హరశాస్త్రిపై పరామరిక కప్ప

గించి యీ సంగతియంతయు సుల్తానునకు వర్తమాన మంపి కొండపల్లిలో వేయి సైన్యము, రాజమహేంద్రవరమున రెండువేల సైన్యమును నిలిపి తక్కిన సైన్యము నంతయు నహమ్మదాబాదునకుఁ బంపివేసెను. తాను రాజమహేంద్రవరమునకుఁ బోయి క్రొత్తగా సంపాదించిన యీ రాజ్యము మీది శిస్తులు మొదలయిన సంగతు లచ్చటనుండి విచారించుచుండెను. అంభోజరాజు హరశాస్త్రిని కటకము రమ్మని చాల బలవంతము చేసెను. కాని యాతఁడు వెళ్లలేదు. చివరకతడు శాస్త్రియొద్ద సెలవుతీసికొని కటకమునకుఁబోయి తన రాజ్యమును దాఁ బాలించుకొను చుండెను. గజపతియైన యంభోజరాజు కొండపల్లి సత్రములోని యవ్వకు నూరు నాణెములు నొక జరీ శేలువయు బహుమతిచేసి పోయెను. ఆ యవ్వ సంతోషమునకు మేరలేదు.

# పదియవ ప్రకరణము

ఆ సంవత్సరము దేశమున నెచ్చటను వానలు లేక పోయినవి. పంటలు పండలేదు. వెనుకటి సంవత్సరము నిలవయున్న ధాన్య మాయేట జనులందరు తినిరి. కాని యేఁడాది చివరకు వచ్చువరకుఁ దిన గింజలేక దేశ మల్లాడిపోయెను. గ్రహములు వక్రించెను. శని మీనరాశికి వచ్చెను. రాత్రుల యందుఁ దోక చుక్కలు తూర్పునఁ గనిపించుచు వచ్చెను. మధ్యాహ్నములయందు మేఘములు పట్టుచుండెను. ప్రొద్దుటి పూటఁ జినుకుచుండెను. ప్రొద్దుగ్రుంకిన వెంటనే యాకాశము నిర్మలమై నక్షత్రములు ధగధగలాడఁ జొచ్చెను. కాసిన నాలుగెండలు తెల్లనై వాయువీథులఁ జెమ్మ లేమిఁ దెలుపుచుండెను. గాలి యెచ్చట నాఁపటయైనను లేకపోయెను. మబ్బులు పట్టినట్లేపట్టి యింతలో విచ్చిపోఁజొచ్చెను. మఖలో నువుమ లేదు. కన్యలో చినుకలేదు. తొలకరించిన వేళ దక్షిణదశ యందు పెద్ద మేఘగర్జనలు బయలుదేరెను. ఇట్టి చిహ్నముల చేత జనులు భీతులై యాలగోలు బాలగో లయినది.

మహాధనవంతులు పెట్టరాని ధరలు పెట్టి మటుమాయమయ్యు నచ్చటచ్చటఁ గనిపించు ధాన్యములను గొని తిన సాగిరి. బీదవారల స్థితి చెప్పరాని దయ్యెను. మొదలఁ గొన్నాళ్ళు గుమ్మడికాయలు సొరకాయలు త్రొక్కుకొని

తినిరి. అవికూడ కరువయ్యెను! తరువాత చింతాకు తొక్కు-కొని యుప్పుగల్లువేసి తినఁ జొచ్చిరి. ఈతగుంజు తుంగ ముస్తెలు మొదలయినవి తినిరి. అవియు దొరకవయ్యెను. చింతగింజల గంజి కాచుకొని త్రావఁజొచ్చిరి, పశువులు చచ్చెను. పక్షులు చచ్చెను. జనులు జావఁజొచ్చిరి. తవిదలు, గంటెలు, ఎఱ్ఱవడ్లు నారుపోసి యవినూతులయొద్ద నేతామఁలతోఁదడుప సాగిరి. కాని నూతిలో నీరుచాలక యవియు మాడిపోయెను. ఆకాశమునఁ బిట్ట నేలమీద పురుగులేకుండ మాడిపోయెను. కొందరుతిండిదొరకక దొరకక యొకరోజునదొరకి కడుపునిండఁదిని హరించుకొనలేకచచ్చిరి. ఎక్కడో యొకపుణ్యాత్ముఁడు బీదవారలకు గంజి పోయించు చుండెనని విని జనులాతని యున్న చోటునకుఁ బరువెత్తి పోఁదొడంగిరి. వీరు వెళ్ళువర కాతఁడది మానివేయగా వీ రుస్సురని యే చెట్టుక్రిందనో పడి ప్రాణములు కడబట్ట నిదురించ సాగిరి. ఇట్లు రెండు మూఁడేండ్లు కరువై దేశము పరశురామప్రీతి యైనట్లు దుష్టరాజు సైన్యములు చెలరేగి ధ్వంసము చేసినట్లు హల్లకల్లోలమై పోయెను. ఈ కరువు ద్రావిడకర్ణాట మహారాష్ట్రాంధ్రదేశములఁ దంతటను చెలరేగుటచే సమీప దేశములనుండి ధాన్యము తెచ్చుకొనుటకును వీలు లేకపోయెను.

ఈ కరువులో సంసారములు సంబాళించు కొనలేక చాలమంది మనుజులు తమ గ్రామములు వదలిపెట్టి పోయిరి. కొండపల్లి సత్రములోనియవ్వ తానూరు వదలిపెట్టిపోయెను.

అందుచే హరశాస్త్రి తన భోజనము రాధ యింటిలో చేయ మొదలుపెట్టెను. అందుచేత రాధయింటసాలున కారు నెలలు దారిద్ర్యము లేకుండెను. ఎట్లయినను వారియింటను కష్టముగానే యుండెను. రాధ యొక రోజున చెరువులో స్నానముచేసి యింటికి వచ్చెను. ఇంట బియ్యములేవు. హర శాస్త్రి తెచ్చునని కూర్చున్నది. హరశాస్త్రి రెండుజాము లకువచ్చి 'తల్లీ! నేఁడుపవాసమే' యనెను. అందరు నా నా డుపవాసముండిరి. గోపన్న చాల బలహీనుఁడు. భార్య చిన్న నాఁడేపోవుట, దారిద్ర్యము, రాధను పెంచుబాధ్యత, వీనితో గోపన్న యారోగ్యము పూర్తిగాఁ జెడిపోయెను. అది క్రమ క్రమముగా వృద్ధిపొంది యీ కరువు వచ్చిన తరువాత నెక్కువచేసి యాతఁడు మంచమునుండి లేచుటలేదు. అతఁ డన్నములేకుండ నొక్కపూటయైన నుండలేఁడు. రాధకుఁ దన స్థితికన్న తనతండ్రిస్థితి దుర్భరముగా నుండెను.

రాధ అప్పుడు దక్షిణదిక్కుననున్న చింతల తోఁపు లోనికిఁబోయెను. ఒక యెండిపోయిన పచ్చివెలగకాయ యొక చెట్టుక్రిందఁ బడియుండెను రాధ అది తీసికొనివచ్చి యందు లోని గుజ్జు నీట నానఁబెట్టి యుడికించి యుప్పువేసి తండ్రికిఁ ద్రాగనిచ్చెను. అతఁడది త్రావి డోకుకొనెను. ఆనాఁడు తెల్ల వారుజామునకు గోపన్నకెగశ్వాసహెచ్చిపోయెను. బ్రదుకుటయే దుర్లభ మయ్యెను. మరునాఁడు తెల్లవారిన తరువాత హర శాస్త్రి తూమెడువడ్లు తెచ్చెను. అవి రాధ యొక్క చేతితో

దంచి వారిద్దరికి వండిపెట్టునప్పటికి రెండుజాములు దాటి పోయెను. అవియొక్క పూటతిని పదిరోజులు నెమ్మదిగా గడ పెను. రాధ తండ్రికి హరశాస్త్రికి నన్నముపెట్టి తా నొక ప్పుడు భోజనము చేయకయే పండుకొనును. హరశాస్త్రి తల్లి! అన్నము తింటివా! అని అడుగును. ఆమె తింటినని సమా ధానము చెప్పను. అతఁడు నిజమేయనుకొనును. మరునాఁడు రాధ లేవలేక పోవును. హరశాస్త్రి కప్పుడు తెలియును. :అమ్మా! నా తిప్పలు నేను పడెదను. దొరకినప్పుడే యగును తినక చచ్చిపోదుమా! అమ్మా! నీ వీమాత్రమున్నావు కనుకనే యుడుకవేసిపెట్టుచుంటివి. 'నీవే అస్తు' పిస్తుయితివా! మాకు గతియేమి?' అని మందలించును. ఆమె నోపిక లేకయునవ్వి 'రాత్రి యాంకలి కాలేదు బాబాయీ! లేకున్న నెందుకు తినను' అని సమాధానముచెప్పి సర్దుకొనిపోవును.

ఈ కరువిట్లుండ రాధకు పన్నెండేండ్లు వచ్చెను. తినఁ దిండిలేక పోయినను వయస్సువలన రాధ వ్యక్తురాలు కాక తప్పదు. పెండ్లి చేయనిచో నలుగురు వెలివేయుదురు. ఈ దారిద్ర్యమునకుఁ దోడువెలిగూడఁ దటస్థించెనా యింక చెప్పవలసిన దేమున్నది యని గోపన్న దిగులుపడఁజొచ్చెను. మంచములోఁబడియుండి ఖంగుఖంగున దగ్గుచు లేవలేక లేవ లేక లేచి కూర్చుండి యెదురుగానున్న హరశాస్త్రితో నొక నాఁడిట్లనియెను. 'అన్నా! రాధ నాకుఁ గడుపునఁబుట్టినది కాని యసలు తండ్రివి నీవే. దాని బాధ్యతా బాధ్యతలు

నే నప్పు చెప్పకుండ నీవే నెత్తిన వేసికొంటివి. నేను ఈ వ్యాధితో నెప్పుడు చచ్చెదనో తెలియదు. కరువేమో దిన్న రేగి పోవుచున్నది. ఇప్పుడు సంబంధములకోసము తిరుగుట యనగా నిండ్లు తగులఁబడుచుండగాఁ భోజనమునకుఁగూర్చుండుట వంటిది. కాని బ్రాహ్మణ్యము చాలఁచెడ్డది. ఎట్టిస్థితిలో నైనను కర్మ సరిగాజరుగకున్న నోర్వదు. పిల్లకుఁబెండ్లిమాట యేమిచేసితివి' అని ప్రస్తావించెను. హరశాస్త్రి తలవంచుకొని మాటాడలేదు.

మరునాఁడు హరశాస్త్రియమరావతిపోయెను. అక్కడ నీతఁడొక కుఱ్ఱవానినిఁ జూచెను. వారు బీదవారు. అతనికిఁ దల్లిమాత్రమే యుండెను. మనిసి చూచుట కసహ్యముగానుండును. అతఁడు కొద్దిగా నాలుగు పౌరోహిత్యపు ముక్కలు నేర్చుకొని జీవించుచుండెను. అతఁడుతప్ప వేరే సంబంధములేదు. రాధవంటి రత్నమువంటి పిల్లను తీసికొని పోయి వాని కిచ్చుటాయని హరశాస్త్రి మొదట సందేహించెను. రోజురోజుకడచి రాధను సీడు తప్పిపోవుటచేతనుకరువు చేతను ధనవంతుల స్వార్థపరతచేతను హరశాస్త్రి కింకొక మార్గము లేకపోయెను.

హరశాస్త్రి యా సంబంధము నిశ్చయించి వచ్చి గోపన్నతోఁ జెప్పెను. గోపన్న యంగీకారము వడసెను. రాధ కేమియుఁ దెలియదు. హరశాస్త్రి తన సాహుకారు నొద్దకుఁబోయి యొకవంద నాణెములు చాల కష్టముమీదఁ

దెచ్చెను. లగ్నము నిశ్చయించి యమరావతి గుడిలో వివాహము అయిన దనిపించెను. పెండ్లికొడుకు పేరు రామయ్య రామన్నయనికూడ యందురు. అతనిది బాకినోరు. పండ్లెగుడు దిగుడు. నడక కొంచెము వంకర. కొద్దిగాఁ చాదస్తుఁడు. పెండ్లి జరిగినంతసేపు హరశాస్త్రి తలవంచుకొని కూర్చుండెను. రాధ తన మగనిని జూచి మొదటఁగొంచెము చింత పడెను. తరువాత సూరకున్నది. కర్మానుభవ మట్టిది.

పెండ్లియయిన తరువాత మరలఁ గొండపల్లివచ్చిరి. పెండ్లికొడుకు, నతని తల్లియు, నతని వేలువిడిచిన మేనత్త కొడుకు, వానిభార్యయు, పెండ్లివారు వీరు. వీరునలుగురు కొండపల్లివచ్చి కేవిణీవేసిరి. జరుగుతెరువులేదు. కరువులో నధికమాసము, అందులో పెండ్లి. హరశాస్త్రి వారముఱోజులయినతరువాత మొగమోటమి విడచి రామన్నతో వెళ్లుమని చెప్పెను. రామన్నకుఁ గోపమువచ్చి 'దరిద్రసంబంధము చేసికొంటిమి' అని రుంజుకొనుచు లేచిపోయెను. అతనితల్లి 'యీపిల్ల మాకక్కఱ లేదు. మాకుఱ్ఱవానికి వేరే పెండ్లి చేసికొందుము' చేతనైనన్ని శాపనార్థములు పెట్టి లేచి పోయెను.

బంధువులింత మర్యాదతోఁ బోయిన తరువాత హరశాస్త్రి చాల దుఃఖించి తాను రాధ గొంతు కోసితి ననుకొనెను. ఒకచోటఁ గూర్చుండి హరశాస్త్రి ఖేదపడు చుండగా రాధ వచ్చి 'బాబాయీ! నీవు దుఃఖించుట యెందులకు నీకిది

యెందులకువచ్చిన సంత. నీవు తెచ్చి యీకంపతోడుగు నీమీదికి లాగుకొంటివి. నా కర్మానుభవముతో నీవు దుఃఖపడ వలదు.' అని మది కట్టుకొనఁ బోయెను. గోపన్న దగ్గుచునే పెండ్లివారిని మధ్యమధ్య తిట్టుచుండెను.

పెండ్లివారుండగా నెచ్చటనో ఒకచోటఁ పదార్థములు పుట్టుచుండెడివి. వారు వెడలిన తరువాత దారిద్ర్యము గృహములో మరలఁ దాండవించినది. చివరకు హరశాస్త్రి కోటలోనికిఁ బోయి ఖిల్లాదారునికి తన తాతతండ్రులు సంపాదించిన యొక రత్నపుటుంగర మమ్మి యొకపుట్టెడు ధాన్యము కొని యది గోపన్న యింటికిఁ బట్టించెను. ఆ యుంగరము కొన్నివేల టంకములు ఖరీదు చేయును. కాని యిప్పుడొక పుట్టెడు ధాన్యము ఖరీదు చేసెను. దానితో రాధయింట గ్రాసము కొదువ తాత్కాలికముగాఁ దీరిపోయెను.

పెండ్లి యయిన మూఁడు నెలలకు రాధ వ్యక్తురాలయ్యెను. అత్తవారింటికిఁ గబురుపంపగా వారెవరు రారైరి. అక్లే యూరిలోని పేదముత్తైదువులే సాయమైరి. ఆమూఁడు రోజులు గడచిపోయెను. నాల్గవరోజున రాధయే మరల వంట కయ్యెను. గోపన్న దగ్గుచు నేడ్చెను. హరశాస్త్రి యేయూరో లేచిపోయెను.

రాంబై రాగి యెచ్చట నుండియో యూడి పడెను. ఒకనాఁడతఁడు రాధను వెదకికొనుచు వచ్చి 'తల్లీ! సుఖమా!' యనెను. రాధకు వానియందకారణబాంధవముపొడమికరువు

తనపెండ్లి హరశాస్త్రి మహోదయ తనతండ్రి తీరనివ్యాధి తన యత్తవారి కోపము నన్నియు నతనితోఁ జెప్పుకొనెను. బైరాగి కరువునకుఁ జింతపడి తాను కాశికిఁ బోయి వచ్చితి ననియు మూలిక తెచ్చితి ననియుఁ జెప్పి యామూలిక తానే యామె మెడలోఁ గట్టెద ననెను. మరలఁ జూచి రాధకు వయసు పైనొన్నదని తెలిసి తల్లీ నీవే కట్టుకొను మనెను. ఆమూలిక మెడలో నున్నంత సేపు రాధకుఁ గీడు కలుగదు.

---

# పదునొకండవ ప్రకరణము

కరువిల్లు చెలరేగిపోవుచుండగా బీడను మహమ్మదుషా లంపటత యెక్కువయ్యెను. ఆతనికొక పెద్ద సర్దారుకూతు నిచ్చి పెండ్లిచేసిరి. షాకిప్పు డిరువది రెండేండ్లు వచ్చెను. ఆతని కొక కుమారుండు కలిగెను. కుమారునకు నాలుగేండ్లు. షా ప్రకృతి చిత్రమైనది. అతని చిన్నప్పుడు మహమ్మదు జహానును నతని తల్లియు నతనిమనస్సుమీదఁ బనిచేసిరి. అందుచే నతని మనస్సు చాల నుద్వేగ ప్రకృతి యయ్యెను. అతని బాల్యమున నైజాంషానుచంపించుట జహానునుచంపించుటతో నతని ప్రకృతిలోఁ గొంత కాఠిన్యమేర్పడెను. దీనివలన నతని మనసునకు కాఠిన్యము మార్దవము నొకదానినివిడిచి యొకటి యుత్కృతముగా స్వభావములై పోయెను. మార్దవము వచ్చినప్పుడెల్ల రాజు తన యంతఃపురముననే వసించును. నగరమునఁ దనకంటికి నచ్చిన స్త్రీ యెల్ల యతని లంపటత కెరయగు చుండెను. సుందరాకృతి యయిన యంతఃపుర పరిచారిక దాసీ మొదలయిన వారాతని యనుగ్రహమును తేలికగా సంపాదించు కొనుచుండిరి. ఇది చిన్నరాణి కిష్టము లేకపోయెను. కాని యేమి చేయకలదు.

అతని మనస్సునకుఁ గాఠిన్యము చేరినపుడు తనకు కోపమువచ్చిన ప్రతిమనుజుని జంపించుచుండెను. అతనియొను

టనే వాఁడు నరుకఁబడవలయును. ఒక్కొక్కప్పుడు షా తానే కత్తితీసికొని వానిని జంపును. ఇది రాజమర్యాదకుఁ దగనిదైనను షా కంధలో నానందము కనఁబడు చుండెను. దయ వచ్చినపు డతని దాతృత్వమునకు మేరలేదు. క్రోపము వచ్చినప్పు డతని రాక్షసత్వమునకు మేరలేదు. కాని మహమ్మదుషా మంచియోధుఁడు. గుఱ్ఱపుస్వారిలో గుఱ్ఱముమీఁద నెక్కి యుద్ధము చేయుటలో కత్తియుద్ధములో మల్లయుద్ధములో షాతో సమానుఁ డాతనియాస్థానమున లేఁడు. దక్షిణహిందూస్థానమునందే లేఁడని చెప్పవచ్చును.

ప్రజలందరు కరువుచేత నిట్లల్లాడుచుండగా సుల్తాను తానేమియు వారి యాపద కక్కఱకు రాక తన యంతఃపురములో భోగము లనుభవించు చుండెను, నిరత మతని భోగపరాయణత్వము చూచినజనుల కతనియందు వైముఖ్యము కలిగెను. కాని యతని చండశాసనత్వము తలచి యెవరును మాటాడలేదు. సుల్తానుని యీ భోగపరాయణత్వ, మీ యుదాసీనత, పొక్కిపొక్కి రాష్ట్రమంతయుఁ దెలిసెను. అన్నియెడల సుల్తాను నెడల నిరాదరణ ప్రబలెను.

కొండపల్లి కోటలోఁగూడ నీ భావము పెచ్చుపెరిగిపోయెను. ఆకోటలోని సైనికులలో సగమునకుసగముహిందువులు. పూర్వపు గజపతులక్రింది సేనా నాయకులు సరదారులు నచ్చటనుండిరి. ఖిల్లాదారు మహమ్మదీయుఁడై వారికి బత్తెములు సరిగా నీయలేదు. కరువువలన సైనికులు మాడి

పోయిరి. వారు జీతములు వృద్ధిసేయుమనిరి. ఖిల్లాదారు వారి మాటలు నిరాకరించెను. వారిలోఁ గొందరకు జీతములు విరుగఁగోసెను. వారిజీతములు కొంత నాణెములరూపము గను కొంత ధాన్యరూపముగను నుండెను. ఖిల్లాదారంతయు నాణెములరూపముగాఁజేసి ధాన్యము నిలువచేసెను. సైనికు లకు కరువురోజులలో నాణెములతో నవసరములేకపోయి ధాన్యరూపమయినతమ జీతమునుగూడ ఖిల్లాదారురాకుండఁ జేయుటచేత వారికి ఖిల్లాదారుపైఁ గోపముకలిగెను. గుసగు సలు, చెప్పినపని చేయకపోవుటలు ప్రారంభమయినవి. అట్టి వారిని ఖిల్లాదారు కఠినముగా శిక్షించెను. ఇట్లు ఖిల్లాదా రుపైఁ గోపము గలవారిలో మహమ్మదీయులుకూడఁ జాల మందికలరు. ఖిల్లాదారు కొందరు మహమ్మదీయ సైనికులను వీరిమీాద వీరి చహారా కనిపెట్టుటకు నియోగించెను. ఇందు చేత వీరిక్రోధము చెలరేగెను.

భీమరాజనుసరదారు గజపతులనాఁటివాఁడు. అతఁడు నైజాముల్ ముల్కుచేత నోడింపబడి యిన్నాళ్లుగా నిచ్చట నుండినను వీలుకుదిరినచో మరలఁ గొండపల్లి గజపతుల క్రిందికిఁ దేవలయునన్నవాఁడు. అతఁడీసమయము కనిపెట్టి సైనికులను రెక్కొలిపి తిరుగుబాటు చేయించెను. భీమరాజు కటకమునకు వర్తమానము పంపి గజపతిని పెద్దసైన్యముతో రమ్మనియు రాజమహేంద్రవరము కొండపల్లియు బీడరుసుల్తా నులయొద్దనుండినురల సంపాదింపవచ్చుననియు చెప్పిపుచ్చెను.

గజపతి యెనిమిది వేల గుఱ్ఱపు దళముతో పదివేల కాల్బల ముతో దండెత్తి వచ్చెను.

ఈ లోపుగా భీమరాజు సైనికుల నందరను తాను స్వాధీనముచేసికొని ఖిల్లాదారునుచంపికోటకు దానధిపతియై కోటలో నిలువయున్న ధాన్యమును సైన్యమున కంతకును గొలిచెను. ఆనాఁడు కోటలోఁ బసిబిడ్డ బాలాది సుఖముగాఁ దినిరి. వారికిఁ గరువు పోయిన దనిపించెను. భీమరాజును వేనోళ్ల స్తుతించిరి. ఎంతవరకైనను భీమరాజును వదలిపెట్టమని వారు కత్తులపైఁ బ్రమాణములు చేసిరి.

కొండపల్లివార్త గజపతుల సైన్యము వచ్చు వరకు నైజాముల్ ముల్కునకుఁ దెలియకుండ భీమరాజు కట్టుదిట్ట ముచేసెను. సముద్రమువలె గజపతుల సైన్య మొత్తుకొని వచ్చుటయు తన రెండువేల సైన్యము దాని నెదుర్కొనఁ జాలక పోవుటయు నైజాముల్ముల్కు తెలిసికొని వెంటనే బీదరునకు వర్తమాన మంపెను. ఆ వర్తమానము మేఘ ములమీదఁ బోయెను. ఈ వర్తమానము బీదరునకుఁ జేరి నప్పటికి షాకు మార్దవమురిమ్మవదలి కాఠిన్యమురిమ్మ పట్టెను. వెంటనే మహామ్మదుషా ప్రాంతబకాయి జీతములతోఁ బాటు సంవత్సరము జీతము సైన్యములకిచ్చి యిరువది వేల గుఱ్ఱము లతో నిరువదివేల కాల్బలముతోఁ బరువులెత్తుకొని రాజ మహేంద్రవరము చేరెను. ఇంతసైన్యముతో షా వచ్చుట గజపతివిని తనసైన్యములు వెనుకకుమరలించెను. షాఅంతతో

నాగక గజపతులరాజ్యముజొచ్చి పల్లెలనుకాల్చి బాల లనక వృద్ధులనక గజపతి రాజ్యప్రజలను నరకి వారలను కొల్లగొట్టి రావణసంగ్రామము చేసెను. చివరకోడిపోయిన గజపతిచేయు నదిలేక సంధికొప్పుకొని లక్ష బంగారు నాణెములును రెండు వేల యేనుగులనిచ్చి మహమ్మదుషాతో సంధి చేసికొనెను.

మహమ్మదుషా గజపతుల రాజ్యముమీదికిఁ బోగానే భీమరాజు మునుపు గజపతి సైన్యముతోఁ గలసికొనిన వాఁడు తన సైన్యమును త్రిప్పుకొనివచ్చి కొండపల్లి చేరెను. చేరినది మొదలు దుర్గరక్షణ ప్రయత్నము మీద నుండెను. ఇది వఱకే రెండువేల సైన్యమున కాఱునెలల గ్రాసము కోటలో భీమరాజు నిలువచేసెను. కోట గోడలన్నియు బాగుచేయించి కోట తలుపులువేయించి బురుజులమీద సైన్యమును హెచ్చరికతోఁ గాపుంచి ముట్టడికి సిద్ధముగా నుండెను,

మహమ్మదుషా గజపతిని పారద్రోలి రాజమహేంద్ర వర దుర్గమునకుఁ దగిన రక్షయేర్పరచెను. కొండపల్లి దుర్గ మునుగూర్చి షా యిదివరకే వినెను. ఆ దుర్గము సులభ సాధ్యముకాదని తెలిసికొని మహమ్మదు గవానును తనమాలు గేండ్లకుమారునితో రాణివాసమును రాజమహేంద్రవరమున నుంచి తా నిరువదివేల గుఱ్ఱపు దళముతోఁ గొండపల్లి దుర్గ మును చేరెను.

కొండపల్లి దుర్గమొక కొండమీఁద గట్టఁబడియున్నది. ఆ కోటకుఁ బశ్చిమమున నుత్తరమున నెక్కుటకుమార్గములు

లేవు. ఆవైపుల కొండ గోడ పెట్టినట్లుండును. శత్రువులావైపు నుండి వచ్చుటకే వీలులేదు. ఇంకఁ దూర్పు దక్షిణముల నుండి కోట ముట్టడింపవలయును. తూర్పునఁగొండపై ద్వార మున్నది. ఆద్వారమునుండి కొండక్రిందివరకు గోడ కట్ట బడియుండెను. క్రింద నింకొక ద్వారమున్నది. శత్రువు లీ ద్వారమును భేదించుటయే కష్టము. ఒక వేళ భేదించినను లోని సేనలు కొండయెక్కి యాపై ద్వారమునొద్దకుఁ జేరుదురు. ఆ ద్వారము సాధ్యమగుటకు వీలే లేదు, అచట మనుష్యులు వరుసగా నై దారుగురుకన్న నిలువరాదు. అచటికి గుఱ్ఱములు గాని యేనుగులుగాని వచ్చుటకు వీలులేదు. జనులుమాత్రమే పోవలె. పైనుండి సైనికులురాలు రువ్వుదురు. ఆయుధములు విసరుదురునూనె కాచిపోయుదురు.

ఇంక దక్షిణపుదిక్కునఁ గొండ మైలు మైలున్నర వరకు నేటవాలుగా నుండును. ఈకొండ యచ్చట కృష్ణా నదిలోనికి దిగును. ఈకొండలో సగముదూరమున నొక ద్వారమున్నది. అదిసరియయిన ద్వారముకాదు. అచ్చట బలవత్తరమైన సైన్యమున్నది. కోట ముట్టడించి భేదింప వలయునేని తూర్పునుండి కొంతవరకుఁ గాకపోయినఁ గొంత వరకైన సులభముగాని దక్షిణమునుండి సులభమే కాదు. కొండయానైపున నంతయు విశాలమైనశిలలు వెదురు పొదలు ముళ్లకంచెలు పొదలు క్రిక్కిరిసియుండును. అవిసహజరక్షగాఁ గోటలోనివారు కాపాడుదురు. దక్షిణ ద్వారమునొద్దకు నిడివి

యైన త్రోవయొక్కటియే యున్నది. ఆత్రోవ మైలున్నర పొడుగు. రెండునైపుల నడవి. శత్రువులానైపున నున్న ద్వార మొకవేళ భేదించినను నీమైలున్నరవెంట పదిమంది పదిమందిగా రావలయునేగాని గుంపులుగా వచ్చుటకు వీలు లేదు. ఈమైలున్నర పొడుగునను శత్రువులు పదిమంది నిలచి నచో నెంతమందినైన రానీకుండఁ జేయవచ్చును. తూర్పు ద్వారమునుండి దక్షిణద్వారమువరకు నున్నకోటగోడ కొండ పైభాగమునందు నిర్మింపఁబడి చేరరానిదిగా నుండెను.

కోటలో రెండు తటాకములుండెను. అందు హజార మునకు ముందున్న తటాకము వానలు లేకపోటవుచే నెండి పోయినను నంతఃపురమున్నయెడ చిన్నరాతి యూటకలదు. అది ప్రళయకాలమునందుఁగూడ నెండిపోదు. కోటకుతూర్పు బురుజుపైన నున్న మనిసి కంటికి కోటచుట్టున నెచ్చటనైన నీగ కదలినను గనిపెంచును. ఇట్లాకోట దుర్భేద్యము.

# పంద్రెండవ ప్రకరణము

బైరాగి రాధకు మూలికయిచ్చి షా కొండపల్లి ముట్టడి వేసిననాఁటికి రెండేండ్లు కావచ్చినది. మూలికధరించిన యీ రెండేండ్లను రాధకు మంచిరోజులుగాఁ గనంబడినవి. కరువు లోనే రాధయిల్లు చక్కఁగా జరుగుచుండెను. రాధకత్తవారి కోపముకూడ తగ్గినట్లు కనంబడెను.

హరశాస్త్రి రెండేండ్లక్రిందట బైరాగి మూలికయిచ్చి ననగా నచ్చటినో వెడలిపోయెను. ఇంతవరకు రాలేదు. అతని సంగతి రాధకుఁ దెలియదు. రాధకాపురమునకువెళ్లెను. ఆమె కొన్నాళ్లత్తవారియింట నున్నది. తండ్రిని ప్రక్కనున్న యొక బ్రాహ్మణులయింట నుంచిపోయినది. తండ్రి నత్తవారింటికిఁ దీసికొనిపోవుటకు నత్తగారికి నామెభర్తకు నిష్టము లేక పోయెను.

గోపన్న యిచ్చట నానాకష్టములుపడి కూఁతునకుఁ గబురంపెను. 'తల్లి! యీవ్యాధితో నేనెన్నాళ్లో బ్రదుకను. ఈనాల్గురోజులు నీవు నాకుఁగాచిపోసి తరువాత నత్తింటికిఁ బోవచ్చు' నన అత్తగారు సరేపొమ్మనెను. కోడలును తండ్రి యొద్దకు వచ్చెను. వచ్చి యాఱునెలలైనది.

షా కొండపల్లి ముట్టడి మొదలుపెట్టి రెండునెలలైనది. అంతలో వర్షాకాలము వచ్చెను. తూర్పు సముద్రముమీఁద

గుంపులు గుంపులై కూడిన మేఘములు లయిదేండ్లుగాఁ దమ పొడకాన్పించరానివి పాడిగేదెలు పొలాలనుండి తిరిగివచ్చి నట్లు కూరగవచ్చి వర్షములు వడఁబోసెను. దేశమునకంతకు మహానందమైనది. జనులనందరిఁ గసిమసంగి ప్రాణములుతీసిన మహామారి వెనుకఁ దిరిగినట్లు మనుష్యులను విరచుకొనితినెడు దుష్టరాజు చనిపోయినట్లు జగమెల్లసంతోషించెను. మొదలు పెట్టి నాల్గునాళ్లు వర్షము దేవనిగాఁగురిసెను. సంపూర్ణముగా నశించిపోయిన పక్షిరవ్వరములు మరల మొదలు పెట్టెను. ఆహా! జీవముమొండిది. ఇట్టిమహాక్షామము వందయేండ్లు చెలరేగినను జగత్తు నిర్జీవముకాదుకాబోలు. ఎండి వగవులైన కప్పలలో వాన జీవము తెచ్చినదగా వర్షామాహాత్మ్యమేమని చెప్పవలయును. నాల్గుదిక్కులఁ గమ్మిన మేఘములు జనులకు నాపత్బంధువులవలెఁ దోచెను. వర్షము కురిపించుటకుఁ గడువు నాఁడు చేసిన జనుల ప్రయత్నము లీరీతిగా ఫలించినవని జను లనుకొనసాగిరి. 'అహో! యెంత చేసితిమి. కప్పలనూ రేగించి తిని? యజ్ఞములు చేయించితిమి. ఆ ప్రయత్నము లన్నియు నీనాఁటికి ఫలించినవి. వర్ష రాజా! హరి యు ము న రి యుము. నీవు మా దొడ్డిలోఁ బూచిన బీరపూవులు కొనక లిచ్చెదముగ! రా! స్వామి! ఇన్నాళ్ళగా లేని దయ మామీద నీకెట్లు కలిగినది. ఎన్నాళ్ళకు మా పొలాలలో నీవు నిలిచితివి. ఎన్నాళ్ళకు మా పొలం

లలోఁ బడ్డ నెఱియలు మూసినని' అని జనులు పర్జన్యదేవుని స్తోత్రముచేయ మొదలు పెట్టిరి.

షా ముట్టడి మానివేయవలెనని తలంచెను. కానివర్షములు కురిసిన వెంటనే షాకు ధైర్యము సేకూరెను. రెండు మూఁడు నెలలలో మరలదేశమున ధాన్యలక్ష్మి తాండవించును. తన సైన్యములకింక నిబ్బంది లేదు.

షా యిరువది వేల యశ్వదళములతోఁ గొండపల్లిని ముట్టడించెను. రెండువందల గజములు పది వేల కాల్బలము కూడ నున్నది. కొండపల్లి గ్రామము కోటకు తూర్పుద్వారము నైపున నున్నది. అందుచేత గ్రామము జను లీసైన్యముల యొత్తిడి కాగలేక చాలమంది యూరువదలి లేచిపోయిరి. కాని కొందరు బీదవారు పోయినమాత్ర మెక్కడ జీవింతుమని యందే నిలిచిరి. వారికి సైనికుల దుర్మార్గపు నడవళ్ళచేత బ్రదుకు దుర్లభమైపోయెను. ఈ నడివడి షాకుఁ జాలమంది పోయి చెప్పిరి. షా యొకప్పుడు వారినిగోపించును. మరియొక ప్పుడుదాసీనత తాల్చును. జను లేమిసేయుదురు. రాజుల దౌర్జన్యమునకుఁ బ్రతిక్రియ భగవంతుడు సేయవలయును గాని నిశ్శక్తులయిన పేదజను లేమి సేయుదురు?

మొదటి రెండు నెలల ముట్టడివలన షాకులాభము లేక పోయెను. సైన్యములుతూర్పుద్వారము నొద్దకుఁబోవును. లోని సైనికుల మహాశౌర్యమువలన వెనకకుఁ దరుమబడును. ప్రతి

ప్రయత్నమునకు షా సైనికులు వందలు వందలు చచ్చుచున్నారు. షాకున్న రెండువందల గజములలోఁ గోటతల్పులను డీకొలిపింపఁ జాలునవి యేబదియున్నవి. అవి యంజనాచల సదృశములు. దిఙ్మత్త దంతావళములకు సహాధ్యాయులు అయిన నవి యన్నియుఁ గోటతల్పులమీదఁ బురికొల్పఁబడి తల్పుల బుడుపులచేత వానియందలి కత్తులచేతఁ గుంభపీఠములు పగిలిపోయి పాఱిపోఁ జొచ్చెను. షా మరికొన్నాళ్ళకు కోట దక్షిణద్వారమున ముట్టడి సాగించెను. ఒకనాఁ డచటి కోటద్వారము భేదించెను. కాని కోటలోని భీమరాజు సైనికులు షా సైన్యములను నాయిఱుకుత్రోవలో నానాకష్టములు పెట్టి యేనుగులనుచంపి గుఱ్ఱములను నరకి సైన్యముల చీకాకు పరచి పాఱఁ దోలిరి. ఆనాఁడు షాకు వేయి సైన్యము నష్టమైనది. భీమరా జాతలుపులను మఱునాఁడు బాగు చేయించి యచట నుక్కుతునకల వంటివారిని కాపుంచెను.

ముట్టడి మొదలుపెట్ట నాల్గు నెలలైనది. షాకులాభము లేకపోయెను. మహమ్మదుషా యంత కంతకుఁ గ్రోధమూర్తి యగుచుండెను. తన సేనానాయకులమీద నాగ్రహ పరవశుఁ డగుచుండెను. షా యింకఁ దాను కోట ముట్టడించ నల దనియుఁ గోటచుట్టు కాపువెట్టుకొని కోటలోని యాహారపదార్థములు తఱిగి పోవువరకునుండి వెలుపలినుండి యవిలోనికిఁ బోనీయకుండ చూచుచుండి కోటనట్లు లొంగదీయ వలయునని భావించెను.

లోపలి సైనికులలో సుమారు వేయిమంది మహమ్మ దీయులున్నారు. వారిని చీలఁదీయవలయునని మహమ్మదుషా ప్రయత్నించెను. కాని వారందరు పూర్వపు ఖిల్లాదారుతమ్ము పెట్టిన బాధలనుండి సంరక్షించిన భీమరాజునెడల కృతజ్ఞులై యతనిని విడిపోలేదు. కోటలో రెండువేలమంది హిందూ సైనికులుకలరు. వీరుకాకకోమటులు బ్రాహ్మణులునున్నారు. భీమరాజు స్వవిజయము శత్రుపరాజయము కోరి కోటలోనున్న దేవాలయమునందు బ్రాహ్మణులచేత నభిషే కములుపూజలు చేయించుచుండెను. బ్రాహ్మణసంతర్పణలు చేయించుచుండెను.

వర్షములు లోకమున కిచ్చినంత యానందము భీమ రాజున కీయలేదు. వర్షములు కురియకున్న మహమ్మదుషా ముట్టడినాపి తనయూరికిఁబోవునని భీమరాజునకుఁ దెలియును. ఈవర్షములు కురియుటచేత పాడు తనసైన్యముల కెన్నాళ్ళ వరకైన నింకఁ గష్టములేకుండ నాహార పదార్థములు సమ కూర్చవచ్చును. అదియుఁగాక యప్పుడే నాలుగు నెలలు కడ చినవి. తనకోటలో నింక రెండునెలలకు మించి యాహార పదార్థములులేవు. బయటినుండి షా సైనికులు రానీయరు. మహమ్మదుషా యెన్నినెలలయినను ముట్టడిమానఁడు. ఈసం గతులన్నియు భీమరాజు విచారించెను. కాని తన కోటలోఁ దినుబండారములింక నెన్నిరోజులవరకు వచ్చునో యెవరికిఁ దెలియనీయలేదు. కోటలో సంవత్సరగ్రాసమున్నదని పుకారు

పుట్టించెను. ఒకవేళ నంత కోటలొంగవలసి వచ్చినను రెండు నెలల తరువాతిమాటగదాయని భీమరాజు జూరకుండెను.

మహమ్మదుషా యుద్ధమునుమాని బయటనుండిపిట్ట యైనను లోనికిఁ బోకుండ. గట్టుదిట్టములు చేసి తాను విశ్రాంతి తీసికొనుచుండెను. యుద్ధప్రయత్నములు మానినంతనే షా మనస్సు మరల భోగముల మీఁదికి మరలెను. తన బీగమును కుమారుఁడును దాసీలును రాజమహేంద్రవరమున నుండిరి. తానక్కడకుఁ బోయినచో తన సైనికుల కశక్తప్రబలు నని షాకొండపల్లి వదలిపోగా నిచ్ఛగించలేదు. కొండపల్లిలో భోగపదార్థము సమకూర్చుకోనెంచెను.

కొండపల్లిలోని పేదవారదివరకే షా సైనికుల దుష్ట భావముల ఫల మనుభవించిరి. ఇంక షాగారి దౌష్ట్య ఫల మనుభవించవలయును. మహమ్మదుషాకు వాని కామము నకుఁ దగిన మిత్రుఁడొకఁడుండెను. వాఁడు తృతీయా ప్రకృతి. స్త్రీవలె వేసము వేసికొనును. స్త్రీవలె మాటాడును, సిగ్గు పడును. వాడు కొండపల్లిలోనూరేఁగి వాని కంటికి నందముగా నున్న స్త్రీనెల్ల చూచి సుల్తానునకు వర్తమానము చెప్పును. సుల్తాను సైనికులను బంపి యామెను తెప్పించును.

ఇట్టి సుల్తాను ప్రవర్తనచేతఁ గొండపల్లిలోఁ రక్ష లేక పోయెను. జనులు తమ భార్యల యీ వినాశము చూచి చూచి యేమియుఁ జేయలేక పోయిరి. కొందఱిది రహస్య

ముగా నుంచుకొనిరి. కూటికి గుడ్డకుఁ గలవారిట్టి రహస్య గోపనమునం దశక్తులయిరి. పేదల కది వీలులేకపోయెను.

రాధ హరశాస్త్రిని గూర్చి ధైర్యముగా నుండెను. కాని హరశాస్త్రి యూరనున్న బాగుగా నుండెడిది కదా యని యనుకొనెను. బైరాగిమూలిక తనయొద్ద నున్నంతవర కట్టి యాపద తనకు రాదనుకొనెను. అత్తవారింటికిఁబోదమా యనుకొనెను. తండ్రికి వ్యాధి యెక్కువైనది. అతఁడు మంచములోననే మలమూత్రవిసర్జనము చేయు స్థితిలో నున్నాఁడు. అందుచే నామె కేమి చేయుటకును వీలు లేకపోయెను.

---

## పదుమూఁడవ ప్రకరణము

షా మిశ్రమైన తృతీయాప్రకృతి కన్నొకనాఁడు రాధ మీఁదఁ బడెను. ఆమె యొజ్జని మానిసి. నగలు లేక పోయినను తల మాయనీయక వలువ మాయనీయక పూచిన తంగేడువలె నుండును. నిరుపేదయై తిండి లేకపోయినను నిరంతరము పనిపాటలు చేయుటవలన నామె యొడలు గట్టిపడి యామెపై నెలకొన్న యౌవనము స్ఫూర్తిమంతమై యుండెను. ఆమె యా యౌవనాగమమున నిరాభరణసుందరియైన రతీదేవివలె నుండెను. నిరంతరవ్యాధి పీడితునకుఁ దనతండ్రికామె యెంతచాకిరీ చేయు చున్నను తన పరిశుభ్రతలోఁ గొఱత రానీయదు. ఆమెయందు గల యౌవన ప్రాదుర్భావము దేశమున నాలుగేండ్లుగానున్న క్షామమును గొంతవరకు-మరుగు పరచినది. తిండిలేక యల్లాడుచున్న లోకమునకు తన కామము క్రొవలెనంటఁ బోనిన్నాళ్లు వీలు లేకపోయెను. అదియుఁ గాక పల్లెయందంత దౌష్ట్యము పూర్వకాలమున నుండెడిదియుఁ గాదు.

ఒకనాఁడు ప్రొద్దున రాధ వాకిలి యూడ్చుచుండఁగా వైరాగి వచ్చెను. వచ్చిరాధనుచూచి 'అమ్మాయి మూలిక సురక్షితముగా నున్నదా!' అనెను. రాధ పొకవి చూచుకొని తెలతెల బోయెను. 'ఏ మమ్మా! లేదా' అనెను. రాధ 'అయ్యో

లేదని చెప్పి 'దాదాజీ! ఎక్కడనోపోయెను. నాకుఁజెడ్డరోజులు వచ్చినట్లున్నవి.' అని యింటిలోనికిఁ బోయి తనపక్క దులిపి చూచి అచ్చటవెదకి యిచ్చటవెదకి తుదకు వేసారివచ్చి రాం బైరాగితో దొరకలేదని చెప్పెను. బైరాగి కొంతసేపు తల వంచి నిలుచుండెను. రాధను చేయి చూపింపుమని మరల నామెచేయి చూచెను. ఆ వక్ర రేఖ మునుపటికన్న స్పష్ట ముగాఁ గనంబడుచుండెను. బైరాగియామెనుచూచి "అమ్మా! నీకు రానున్నది యాపదయో సంపదయో తెలిసినది. మూలిక పోవుటయే దానికి గుర్తు" అనెను. రాధకుఁ జెప్పరా నంత భయము వేసినది. బైరాగి యన్న మాటకు రాధ కర్థము తెలిసినది. కాని యాతని చేతనే చెప్పించుటకు 'దాదా! ఏమిటి చెప్పుము. ఆపదయే రానున్నదా! ఏమి యాపద! మా నాయనకుజబ్బుగా నున్నది. నాలుగు రోజుల నుండి ఎగశ్వాస పుట్టినది. ఆతఁడు పోవునా! యేమి?' అనెను. బైరాగి 'తల్లీ! తండ్రు లందరికిఁ బోదురు. అందులో జబ్బుగా నున్న మీతండ్రియుఁ బోయినఁ బోవచ్చును. అది పెద్ద యాపద కాదు. ఆ యాపదకు నీచేతిలోని గీతకు నేమి సంబం ధము.' అని యతఁడచ్చట నిల్చుండ లేక బిరబిర నడచి పోయెను. రాధ యతనిని బిలచెను. అతఁడు మరల వచ్చెద నని వెడలిపోయెను.

ఆనాఁడు పగల్లెల్ల రాధ మూలికకై శోకము సేయుం డెను. తాను కూర్చున్నచోట వెళ్ళినచోట చూచినచోటనే

పదిసార్లుచూడ మొదలుపెట్టెను. ఎన్నిసార్లు చూచినను కనం బడినది లేదు.

తండ్రి కానాఁడు బరువుగానుండెను. కడచిన నాల్గు నాళ్లనుండియే చాల యెక్కువగానున్నది. నేడతనికి శ్లేష్మ మడ్డపడి మాటలాడ నీయలేదు. రెండునాళ్ళనుండి యాహార ములేదు. మాటిమాటికిఁ బ్రాణము కడబట్టుచుండెను. రాధ యానాడు తిండిలేక పవలెల్ల తండ్రియొద్దనె కూర్చుండెను. వైద్యునికోసము రెండుసార్లు తలుపు దగ్గరగానుంచి పోయి వచ్చెను. ఊరివైద్యుఁ డూరిలోన లేఁడు.

రాధ తండ్రియొద్దకుఁబోయికూర్చుండును. మరలపోయి మూలికకై వెదకును. మరలవచ్చి తండ్రిదగ్గర కూర్చుండును. పగలెల్ల నిటు కడచిపోయెను. ఆనాఁడు తనతండ్రి యాలోక మును వదలిపెట్టునని యామెకుఁ దోచెను. చివరకుఁ బ్రొద్దు క్రుంకువేళ నామె మెతుకులు వండుకొని తినెను. తిని యంట్లు తోమి యచటికి వచ్చి కూరుచుండెను. తండ్రికి క్రిందిగ్రుక్క మీదికి మీదిగ్రుక్క క్రిందికినయ్యెను. శ్లేష్మము మిక్కుట మయ్యెను.

ఇంతలోఁ బ్రొద్దుక్రుంకెను. ప్రొద్దుక్రుంకినవెంటనే పక్షు లుకూయనైన లేదు. కొండపల్లిలో నప్పుడు పక్షులే లేవు. సైన్యముల పెద్ద రొదకు భయపడి పక్షులు కొండపల్లి వీడి పారిపోయి యాఱు నెలలైనది. చీకట్లు తరుముకొని వచ్చెను. క్రమముగాఁ బ్రొద్దుపోయెను. ఆచీకటిలో రాధ చనిపోవు

చున్న తండ్రియొద్దఁగూర్చుండి తనజీవితమంతయు నాలోచించుకొని యెంత నిర్భాగ్యపు జీవినాయని యెుక్క నిట్టూర్పు విడచెను.

తండ్రి మీఁదిగుడ్లు వేసెను, రాధ దీపము దగ్గరకుఁ దీసికొనిపోయి తండ్రి వికారమైన మొగము చూచెను. కాలు చేతులు తాకి చూచెను. శీతలత క్రమ్మి యుగమువలె నుండెను. రాధ కాసమయమునఁ బట్టరాని దుఃఖమువచ్చెను తన తల్లి తన చిన్నతనముననే పోఁగాఁ దనకు నిరుగు పొరుగమ్మలచేతఁ బాలిప్పించి పెంచి పెద్దదానినిచేసెను. తనకొరకతఁడెన్ని కష్టములో పడెను. ఆతడిట్టి స్థితిలో నుండగాఁ దానేమియుఁ జేయులేక చూచుచుండెను. తండ్రి కిట్లున్నదని యత్తగారిని భర్తను రమ్మని రాధ యీ వెనుకటి రోజున నమరావతికిఁ గబురంపెను. వారు రాలేదు. రాధ ప్రాణము పోవుచున్న తండ్రి చెవిలో 'రామరామ'యనెను. మరలఁ జూడగాఁ దండ్రికి మరల స్మృతివచ్చి నట్లయ్యెను. అతఁడు రాధవంకఁ జూచుచుండెను. రాధ కొంచెము తెప్పిరి, దొడ్డిలో నెండవేసిన తన దుప్పటి తెచ్చుకొనుటకుఁబోయెను. ప్రక్కనున్న చెట్టుపైనున్న గుడ్లగూబ వికారధ్వని చేసెను. రాధ కొడలంతయు జలదరించెను. మరు నిముసమందు రాధ నలుగురుబలవంతులైన పురుషులు చుట్టుముట్టిరి. ఆమె నోరదిమిరి ఆమెనుబలవంతముగా నెచ్చటికోఁ దీసికొనిపోయిరి. దొడ్డికిఁ గాపులేదు, అందుచే జనులు లోనికి

రావీలయినది. రాధ యవ్యక్త స్థితిలోఁ గూడఁ దనపోవు చోటెద్దియో తెలిసికొనెను.

రాత్రి రెండుజాములైనది. తివాశీలుపరచి రత్నము దీపములుంచి దివ్యభవనమువలె నలంకరించఁ బడియున్న డేరాలో సుల్తాను పెద్ద రత్నకంబళముమీద నొరుగుచు బిళ్ళ నానుకొని హుక్కా త్రాగుచు దూరమున దీనాకృతియై శోకాధి దేవతవోలెఁ దలవంచుకొని నిలుచున్న రాధ వంకఁ జూచుచుండెను.

సుల్తానున కిరునది రెండేండ్లు. మహాబలశాలి. అతని యేక కంచుకమైన శరీరములోని బిగువంతయు వెల్లడి యగు చుండెను. అతని మొగములో మార్దవరేఖలే లేవు వదనము కఠినమై కర్కోటక ప్రకృతిని సూచించు చుండెను. అతఁడు కొంచెము నవ్వు చుండెను. ఆ నవ్వువాని మొగ మున కయోగ్యముగాఁ గనిపించు చుండెను. ఎదురుగా నిలు చున్న రాధ నిలువెల్ల వణకిపోవు చుండెను. కాని యామె బాల్యమునుండియుఁగష్టములే తెలిసినదియగుటచేత నామెకు స్మృతి పోలేదు.

సుల్తాను రాధను పలుకరించెను. నీ పేరేమని యడి గెను. రాధకుఁగొంచెము తురకము తెలియును. ఆకాలములో నందరకుఁ దెలియును. రాధ మాటాడలేదు.

సుల్తాను హుక్కామాని వేసి రాధ వద్దకుఁబోయి తన చేయి యామెమీఁద వేసెను. రాధకు వెంటనే భయ మెల్ల

నంతరించెను. అతనిచేతి నామె విదల్చివైచెను. మనుష్యులు దేవతా ప్రకృతులు రాక్షస ప్రకృతులు నని రెండు తెగలు. దేవతాప్రకృతులకు రసవిభేదము బాగుగాఁదెలియును. వారు శ్మశానమునందునవ్వరు. దేవాలయములయందుపరిహాసము లాడరు. స్త్రీలయందు శౌర్యమునెరపరు. రాక్షసప్రకృతులకు రసము దాని భేదములు తెలియవు. వారికి భగవంతుని గూర్చి పరిహాసములాడు నేర్పుండును. దుఃఖించఁదగిన వేళల యందు వారికి నవ్వువచ్చును. అనునయముచేత సాధించఁ దగిన స్త్రీ జనమును వారు క్రోధముచేత శిక్షించి లొంగఁ దీయచూతురు. వారిది యేలోకమునుకాదు.

రాధ దేహములో నామె తల్లి నెత్తురు ప్రవహించు చున్నది. ఆమె తల్లి పంచికులమునందు పుట్టినది. గోపన్న కామె యదృష్టమువలన లభించినది. ఆమె శ్రుతిస్మృతులు చదివి వేద వేదాంగముల మహార్థములు జీర్ణించిన యింటి పడుచు. ఆమె నెత్తుటిలో వైదిక ధర్మము సార మెత్తునకెత్తు న్నది. ఆ బాలిక రాధయందు, గనబడుచుండెను.

రాధ విదలించినంతమాత్రక్రోధమూర్తియయ్యెను. ఆమె చేతి నతడు మహాకఠినముగాఁబూని విరచెను. రాధకుఁజాల బాధకల్గెను. కాని యామె యా బాధ నోర్చుకొనెను.

సుల్తానామె చేయివదలిపెట్టి యామెవంకఁదీక్ష్ణముగాఁ జూచెను. రాధ యిట్లన్నది—'మనుష్యుఁడు తననాశనమునకుఁ మొట్టమొదట పరస్త్రీ పరిభవకాంక్షలుచేయును. ఇట్టి పనులు

చేసినవారి యైశ్వర్యములు నాయురాయములు నిలువవు.'
సుల్తాను మండిపడెను. ప్రక్కనున్న సేవకులను పిలచెను.
వారామెను కొరడాలతోఁ గొట్టిరి. కొంత సేపాయెను. వారు
శిక్షించి వెడలి పోయిరి.

తరువాత సుల్తాను మరలనామెను సమీపించెను. ఆమె పారిపోఁజూచెను. కాని లాభములేక పోయెను. రాధ తన ప్రాణము లప్పుడేల పోవనుకొనియెను. రాధయన్నది. "నా వంటి యువతిని కలయుటయు రాతిబొమ్మను కలయుటయు నొక్కటియే." సుల్తాను పకాలున నవ్వెను. అతని కన్నులు కల్లు త్రావుటచేత నెఱ్ఱనై నిప్పులు కురియుచుండెను. మరల నతఁడామెను తాకెను. ఆమె విపరిగొట్టెను. అతఁడామెను కౌగిలించుకొనెను. ఆమెయతని రక్క కఱచెను. మరల సుల్తాను సేవకులు వచ్చిరి. సేవకులామె చేతులు కాళ్ళు కదలకుండఁ గట్టిరి. ఆరాత్రియే యామెతండ్రి యింటిదగ్గఱ చనిపోయెను.

ఆమరునాఁడు తెల్లవారినతరువాత నల్లపడిన కాష్ఠము వోలె నమంగళాకృతి, నిర్జీవ,యగురాధ జనులెల్లఁ జూచుచుండగా మహమ్మదుషా శిబిరమునుండి దేహమునందలిగాయములతోఁ గంట్లతోఁ, జినిగిన చీరతో, నపీతకంచుకయై, నడచి వచ్చెను.

———

# పదునాలుగవ ప్రకరణము

రాధ తలవంచుకొని యట్లే తనయింటికిఁ బోయెను దారిలోఁ బ్రతిమనుజుఁడు తనవంకఁ బరకాయించి చూచు చున్నాఁడని యామెకుఁ దెలియును. రాధ కాళ్లయందు చేతుల యందు కట్లున్నచోట నొరసికొని నెత్తురు గారుచుండెను. ఆమె పెదవినుండి నెత్తురులు జారుచుండెను. తల చింపిరిగా లాగబడెను. వక్షమునందు గట్లుండెను. శరీరమంతయుఁ బచ్చి పుండువలె బాధాకరముగానుండెను. ఇంటికిఁబోయెను. తండ్రి సమీపమునకేగెను. తండ్రి చనిపోయి యప్పటికి నైదారు గంటలు కావచ్చెను. చీమలతనియొడలనెల్లఁ బ్రాకుచుండెను. రాధకు దుఃఖమురాలేదు. ఆమె తనతండ్రిని తాక లేదు. దూరమున నుండియే యొకరెండు గడియలా శవము వంక నిశ్చలముగాఁ జూచెను.

చివరకామె యింటిలోనుండి బయటకు వచ్చెను. ఎదురుగా హరశాస్త్రి నిలుచుండెను. రాధ నిలువునఁ గ్రుంగిపోయెను. రాధ యీ వికార స్వరూపముచూచి హరశాస్త్రి దిగ్భ్రాంతి పొందెను. హరశాస్త్రి యామెను తల్లీ! ఇదియేమి? ఈ యాకారమేమి' యని యడిగియామెను తాకఁబోయెను. ఆమె 'తండ్రి! నన్ను ముట్టరాకుము. నేను చండాలురాలను. నా బ్రాహ్మణ్యము పోయినది. ఆసంగతితరువాతఁ జెప్పెదను.

గోపన్న గారు రాత్రి చనిపోయినారు. వారికి దహనసంస్కారములు చేయుటకు మీరు వేళకు వచ్చిరి. ముందర నాపని కానిండు.

హరశాస్త్రి కేమియు నర్థము కాలేదు. రాధ యతనికి యావద్వృత్తాంతము సవిస్తరముగా లజ్జవిడిచి చెప్పెను. చివర కామె" నాయనా! నేను బ్రతికియుండియు లేనట్లె! నాకు సిగ్గెందుకు. ఇది యుచ్చరింప రానిది యిది యుచ్చరింపఁ దగినదియని యెందులకు. కనుక రాత్రి యారాక్షసుఁడు చేసిన సర్వము నీతోఁ జెప్పితిని. గోపన్న గారి శవము నేను తాకలేను. నేను తాకినచోఁ బ్రేతము మైలపడును కదా!" అనెను. హరశాస్త్రి దీర్ఘాలోచన చేయఁ దొడంగెను.

రాధ "నాయనా! ఆలోచన యెందులకు. ఇదినాజాతక ప్రభావము. నాచేతిలోని గీత ప్రభావము. నీకును రాంబై రాగికిని దీనియర్థ మిప్పుడు బాగుగాఁ దెలిసినదా?" అని ప్రశ్నించెను. హరశాస్త్రి తలయెత్తి యామెవంకఁ జూచెను.

రాధకుఁ గోపము వచ్చెను. 'మహామ్మద్‌నుసాను నేను చంపవలయును. నీవు నాకు సహాయము చేయువలయును. అది రహస్యము. నీ వతనితో నీసంగతి తెచ్చి పోట్లాడ రాదు. వానిని కుట్రచేఁ జంపవలయును.' హరశాస్త్రి రాధవంకను నిదానించి చూచి తల యాడించెను. తరువాత హరశాస్త్రి గోపన్న కగ్ని సంస్కారాదికములు చేసెను. హరశాస్త్రి వచ్చెనని నూరారంత గుబ్బటిలి పోయెను. తరువాత పదుమూఁడు

రోజులు గడచెను. నిత్యకర్మ సవ్యముగాఁ జేసి హరశాస్త్రి గోపన్నకు ప్రేతత్వము వదలించెను. హరశాస్త్రి వచ్చినాఁడనియు యాతఁడు రాధయింట నివసించుచుండెనని రాధను మహమ్మదుషా బలాత్కరించిన యారాత్రియే యామెతండ్రి మరణించెననియు హరశాస్త్రికి రాధ చుట్టమనియు మహమ్మదుషా కర్ణాకర్ణిగాఁ దెలిసికొనెను. మనసులోఁ గొంచెము కలగుంపుపడెను. కాని యతనిసుల్తానుతనములోని కలవరము నణంచుకొనెను.

ఊరిలోవారు రాధ కిష్టము హరశాస్త్రి రాకయుఁ దెలిసికొని హరశాస్త్రి యింక నేమిచేయునా, యని యూహింప మొదలు వెట్టిరి. కాని పదుమూఁడు దినములు కడచిపోగాఁ గొంత శాంతి చేకూరెను.

ఈపదుమూఁడు రోజులలోఁ గోటలోఁ జాలమార్పులు కలిగెను. భీమరాజు కోటలోని యాహారపదార్థము లన్నియు నైపోవుట గుర్తించెను. సేనలోఁ బెద్దలనుబిలచి యాసంగతి చెప్పెను. వారు పీరు తలపట్లు పట్టుకొనిరి. ఇంక నాలుగు రోజులకు మాత్రము ఉన్న పదార్థము సరిపోవును. బయటి నుండి పదార్థములు తెప్పించుటకుఁ జేసిన సర్వప్రయత్నములు వ్యర్థ మయిపోయినవి. చివరకు సరదారు లందరు కోట సుల్తాను కధీనపరచుటకు నిశ్చయించిరి. సుల్తాను పరమదుర్మార్గుఁడు. కోటలోని వారి నందరిని నరకించును. భీమరాజును ఏనుఁగుచేతఁ ద్రొక్కించును. అందుచేత నొక యుపాయ

రంపెను. మూఁడవనాటి కాలఁడు వచ్చెను. గవాను సమక్ష మున రాయబారి షరతు లన్నిటికి మహమ్మదుషా యొప్పు కొనెను. ఆ మరునాఁడు కోట తలుపులు తెరువబడెను. ఆమరు నాఁడే గోపన్న వచ్చి పదునాల్గవ రోజు.

మరునాఁడుదయమున షా నిద్రలేచి స్నానాదికములు చేసి తనవెంట గవాన్ తక్కిన సరదారులు రా బారగాఁ దీసి యున్న కోటతలుపులు చొచ్చిదీనముఖుఁడై క్రోధహృదయుఁడై కోటలోనికిఁ బోయెను. కోటలోని సైనికలందరు బద్ధాంజలు లయి యిరుప్రక్కల నిలఁబడి యుండిరి. సుల్తానువెంట వంద మంది సరదారులు నడచుచుండిరి. సుల్తాను సైనికులు పోయి యప్పుడే కోటయంతటఁ గలయ నడచిరి.

సుల్తానుకోటలోపలి ద్వారమునొద్దకురాఁగా నేయచ్చట భీమరాజు మోకారించి సలాముచేసి 'భూమియు నాకసము నకుఁ బ్రభువైన మహమ్మదుషా హాసన్ గంగూసుల్తాను మహాప్రభూ ! నేను పెద్దరాజ్యము వాంఛింపలేదు. మీరో గజపతులో యీభూమి నేలుచుండఁగా మిమ్ము సేవింపఁ వలసినవాఁడ నేను. ఇప్పుడు గజపతులు తమ ప్రతాపము ముందు సూర్యునిముందు దివిటీలవలె నగుటచేసి నేను మిమ్మే సేవింతును.' అనెను.సుల్తాను కొంతశాంతించెను. మరల భీమ రాజు. ''మీరు సాక్షాత్తు పరమేశ్వరునికిఁ బ్రతినిధులు. కావున మీకు నే నీకోట నిచ్చుచున్నాను. నే నిచ్చుటకు నాకధికారము లేదు. ఈకోట యసలు మీకే చెందియున్నది.

కాని నేనీమధ్య కొంత యవినయము చేసితిని. మీరు క్షమింతురని చేసిన వాగ్దానమును మీవంటి మహాప్రభు లతిక్రమింపరని నమ్మకముతో మీదయ నర్థించుచున్నాను' అని లేచెను.

సుల్తాను మొగమున కొదరి రేఖలు సర్వజనులకు గోచరించుచుండెను. అతనిమనస్సులో వీరిన్నాళ్ళు కోట స్వాధీనము కానీయని శక్తి వీరి కెచ్చటనుండి వచ్చినదాయని యాలోచన జరుగుచుండెను. మహమ్మదుషా కాఠిన్యపురిమ్మకుఁ దుదిరోజులు వచ్చినవి ఆ కాఠిన్యముకొంచెము సడలియుండెను. కాని యా రిమ్మ వదలి పోవుదినములలో నది విచిత్రమైన పోకడలు పోవును. ఇప్పుడది యెట్టివిపరీతపుఁ ద్రోవ త్రొక్కునో యతనికే తెలియలేదు. షా కోటలో నడుగు పెట్టినది మొదలింతవరకును నతని నోటినుండి యొకమాట యైనను రాలేదు. అతని మనస్సెంతవరకునునీకోట యిన్నాళ్లు స్వాధీనము కానీయని వారిమీదఁ బగ యెట్లు తీసునాయని యాలోచించుచుండెను. ఆ పగ తీర్చుకొనుటకు వీలులేనిషరతులను కల్పించి భీమరాజాదులు వాని కోపమును మరింత వృద్ధిచేసిరి. ఆ కోపము చివరకు మహమ్మదుషానే దహించునట్లు కన్పడినది.

ఇప్పుడు షా మొగసాలయొద్ద నిలుచుండెను. భీమరాజంతకుముందే సుల్తానునకు నమస్కరించి లేచి సరదారులతోఁ బాటు నిలుచుండెను. సుల్తాను తలయెత్తి చూచెను. తనకు

పంచగజముల దూరములోపున నొకదేవాలయమున్నది. అందు బ్రాహ్మణులు కూర్చుండి వేదములు చదువుచుండిరి వారినిజూచినసుల్తానులోని మహమ్మదీయ మతావేశము పెచ్చుపెరిగిపోయెను. ఇన్నాళ్ళు కోట పట్టుపడక పోవుటకు గారణము హరి ప్రార్థనలని సుల్తానునకు దోచెను. అదియుఁ గాక మరతులలో వారినిఁ జంపరాదని లేదు. అన్నివిధముల నా బ్రాహ్మణులమీద మహమ్మదుషా కోపముయొక్క ఫల మగపడుటకు వీలేర్పడెను.

సుల్తానచ్చటికిఁ బరువెత్తెను. సరదారు లందరాయన వెంటఁ బరువెత్తిరి. అతఁడచ్చటికిఁ జేరుటతోడనే కత్తిదూసి 'కాఫరులారా! నాకోటలోనుండి యావలికిబొండు. ఇచ్చట దుష్టదైవమును గొల్చుచున్నారా!, అని నిరాయుధులు నిశ్శస్త్రులునైన వారలను తన కత్తికి బలియిచ్చెను. అప్పుడట్లు నరుకఁబడిన బ్రాహ్మణులసంఖ్య యిరువది. సుల్తాను వెలగల దుస్తులన్నియు బ్రాహ్మణ రక్తముతోఁ దడిసిపోయెను. గవా నచ్చట నిలుచుండి మాటాడలేదు.

భీమరాజునకు హిందూ సైనికులకుఁ గ్రోధము . భూనభోంతరములు పట్టనంతవచ్చెను. కోట సుల్తాను స్వాధీనము చేసినందులకు వాగిలోఁబ్రతివ్యక్తియుఁదన్నుఁదాఁ దుచ్చుఁడని పించుకొనెను. ఈబ్రహ్మహత్యా పాతకము ప్రతిమనుజుఁడును తనదిగా భావించుకొనెను.

సుల్తాను తత్క్షణము యీదేవాలయము పడఁగొట్టుమని యాజ్ఞయిచ్చెను. ఆపనియిరువది వేల మహమ్మదీయ సైనికుల చేతఁ బదినిముసములలోఁ జేయఁబడెను. మిగిలిన గోడల మీద మసీదు మరి పదినిముసములలో లేపఁబడెను. సుల్తాను ఆమసీదులో నిలుచుండి నమాజు చేసెను. సుల్తాను కోటలోనికిఁ బ్రొద్దున బయలుదేరెను. నమాజు పూర్తియగువరకుసరిగా రెండుజాములయ్యెను. సూర్యుఁడు మండిపోయెను. అంతవరకు సరదారులందరక్లే నిలచియుండిరి.

భీమరాజు తనలో "నేనువీనిని పొడిచిచంపుదునా! చంపిన నేమగును. తక్కినవారు నన్ను చంపుదురు చంపనిమ్ము నష్ట మేమి? ఛీ !అట్లుకాదు. భగవంతునిలీల లతి విచిత్రములు. నేను వానితో జోక్యమేల కలిపించుకొనవలెను. ఎవని కర్మము వాఁడనుభవించును. వీనికంతసుఖమైన చావెందుకు అని యనుకొనెను.?" భీమరాజు వెనుక వెనుకకుఁ బోయి కోటనుండిదిగి యెచ్చటికో పోయెను. వాని నెవ్వరు ననుస రించలేదు.

సుల్తానుని యీ పనిచూచియందరును చింతించిరి. మహమ్మదీయులుకూడ "బహమనీసుల్తానులు బ్రాహ్మణులఁజంప రాదు. ఇది వారిపూర్వులుచేసిన ప్రతిజ్ఞ. ఇదియేదో గొప్ప యాపదకు దారితీయుచున్నది" అని తలంచి భయపడిరి. అచ్చటనున్న హిందువులందరును కోపముచేత దమయొడళ్లు తమకుఁ దెలియక నిర్వచనులయిరి.

నమాజుచేసిన తరువాత సుల్తాను వెనుదిరిగితన సరదార్ల వంకఁజూచెను. అందులో మొదట నతనికిఁ గనఁబడినవాఁడు హరశాస్త్రి. నవాబునకు గల కోపమంతయు నిశ్శేషముగాఁ బ్రార్థనా సమయమునకే తగ్గిపోయెను. తాను ఘనకార్యముచేసితినన్న తృప్తిసుల్తానుమనస్సులో నిండియున్నది. కావునఁ దక్కినవారు తన యీ కార్యమునుగూర్చి యేమనుకొనుచుండిరాయన్న జ్ఞానమతనికి లేకపోయెను.

సుల్తాను హరశాస్త్రిని చూచినంతనే యాశ్చర్యము చూపి 'మీ రెప్పుడు వచ్చితి' రని యడిగెను. అంతలోనే సుల్తానునకు రాధసంగతి జ్ఞాపకము వచ్చెను. మొగము చిన్నపోయెను.

హరశాస్త్రి 'తమరు బ్రాహ్మణులను స్వయముగాఁ జంపుచున్నపుడే వచ్చితిని' అని సమాధానము చెప్పెను. హరశాస్త్రి మొగములోఁ గదలిక లేదు. ఏ భావమును గోచరించలేదు. సుల్తానున కేమి సమాధానము చెప్పుటకును తోచలేదు. హరశాస్త్రిమీదఁ గోప పడుటకును గారణము కనపడలేదు.

ఏదో యనవచ్చియింకొకటియనినట్లు సుల్తాను "మాకు మిమ్ము చూడవలెనని చాల రోజులనుండి యున్నది" అనెను. హరశాస్త్రి—"ఈసారి తమకొలువువీడి యెచ్చటకునుపోను. నాకుఁ గాలిశని వదలిపోయినది." అనెను. ఇంతలోహరశాస్త్రి చూపు గవానుపైఁబడెను. హరశాస్త్రి మరల సుల్తానుతో

"ప్రభూ! గవానువంటి బుద్ధిమంతులు వృద్ధులు మంచిచెడ్డలు తెలిసినవారు మిమ్ము సన్మార్గమందు నడుపు వారుండగా సుల్తానులు మమ్మేలఁదలంచిరో తెలియలే'దనెను. గవాను హార శాస్త్రివంకఁజూచెను. హరశాస్త్రిమొగము శాంతమై యుండె మియు నర్థము తెలియులేదు.

---

## పదునేనవ ప్రకరణము

---

రాధ తన పాతివ్రత్య పతనారంభసమయము నుండి భూశయ్య నంగీకరించెను. శూద్రాన్నమును స్వీకరించెను. కాని శూద్రగృహముల భుజించదు. బ్రాహ్మణులకు దూర ముగాఁ బోవును. ఎవ్వరితోడను మాటాడదు.

రాధవార్త కొండపల్లి బ్రోఁగిపోయి యాబ్రోత యమరావతిలో వినఁబడెను. కొండపల్లివారికి రాధ దుర్దశలో జాలియు నశక్తతయు దైవదౌర్మార్గ్యము గోచరించగాఁ బదిక్రోసుల దూరమున నున్న యమరావతి వారికి నామె యీవార్తయందు పారిహాస్యము అబ్రాహ్మణ్యము నిర్దయ

నిరాదరణ గోచరించినవి. రాధ పతియైన రామన్నను వారు పీరెత్తిపొడువ నారంభించిరి. అసలతఁడు మేధకుఁడు. తనఁ భార్య కట్టి దుర్దశ తటస్థించినదని వినగానే యతఁడేడువ నారంభించెను. అందులకందఱు నతనిని ఎగతాళిచేయ మొదలిడిరి. పాపమా పేదగుండెవాఁడు తాను చేసినద తప్పను కొనెను. మరియేమి చేయవలెనో యతనికిఁ దెలియలేదు. మఱునాఁడు రామన్న తల్లితో 'అమ్మా! నీకోడలిని తీసుకొని వత్తునా' యనెను. 'అయ్యో! చెడిపోయినదాని నెట్లు తెత్తువురా! నీమతి కాలిపోను' అని నిందించెను. దానితో రామన్న నోరతుకుకుని పోయెను.

గోపన్న పరలోకక్రియలకు రమ్మని హరశాస్త్రి రామన్నకు రామన్న తల్లికిఁ గబురంపెను. కాని వారెవరును రాలేదు. అసలు బ్రాహ్మణులే రాలేదు. కొందరుమాత్రము రాధ దూరముగాఁ దినుచున్నదని యామెకు నీ కర్మకు సంబంధము లేదనియు వచ్చిరి. వచ్చిన వారిని దక్కినవారు పరిహసించిరి.

రాధకు సంఘములోఁ దనకు వచ్చిన మార్పు తెలియును. తన కింకఁ దన భర్తయింట నుండరా దనియుఁ దెలియును. కాని యొకసారి పోయి యత్తవారింటి స్థితి యెట్లున్నదో కనుగొనివచ్చుట తన విధి యనుకొన్నది.

తండ్రి చచ్చిన పదునాల్గవరోజున ననగా కొండపల్లి కోట మహమ్మదుషా కధీనమైన రోజున సుల్తాను నిరువదిమంది బ్రాహ్మణులను కత్తితో నరికిన రోజున హరశాస్త్రి కోటకు

పోఁగాఁ గాను రాధ యత్తవారింటికిఁ బోయెను. ఆమెను దారిలో నిద్దరు ముగ్గురు నిలచి చూచిరి. రాధ వారిపంకనైన చూడక తన దారిని దానుబోయెను.

పసివాండ్రైన నొకరొక్కరి మనస్సు పరిపక్వదశకు వచ్చును. రాధ యట్టిది. ఆమెకు లోకము దాని దుశ్చేష్టలు సర్వము తెలియును.

ఇంకఁ దన చేమితప్పు. తన్ను జనులట్లు నివ్వెఱపోయి చూచుటయేల. ఈసంగతి రాధకుఁ గష్టము కలిగించెను.

అది శరత్కాలమగుటచేత కృష్ణానది యుబ్బుతగ్గెను. ఒక పడవమీద రాధ యావలి యొడ్డునకుఁ జేరెను. పడవలో నున్నవా రామెను జూడ మొదలిడిరి. ఆమె యొక యొడ్డునఁ గూర్చుండి కృష్ణలోఁ జూచుచుండెను. పడవ యా యొడ్డు చేరువరకు రెండుజాములయ్యెను. అమరావతి పోవువరకు మూఁడు జాములు తిరిగెను.

రాధ యత్తవారిల్లు గ్రామము నడిమిబజారున నుండుటచే రాధ తప్పనిసరికి జనసమ్మర్దమునుండి పోవలసి వచ్చెను. వయసులోని వారు వయసు దాటినవారు పనుసే నెంతో యా పసిబాలకసంకోచముకదృష్టులు తటాపి పసుప్రవర్తన నెరపిరి, ఆమెకు నఖశిఖ పర్యంతము రోషాగ్ని ప్రజ్వరిల్లెను.

తుదకత్తవారింటికిఁ జేరెను. అత్తగారు వీధిలోననే యామెను చూచి పిడితలుపు వేసెను. రాధవెంట నలుగు

కైదుగురు పురుషులు వచ్చి వీథియరుగుమీఁదఁ గూర్చుండిరి. ఇంతలో రామన్న యెచ్చటినుండియో వచ్చి రాధను చూచెను. అతని కేమపు వచ్చినది. ఇదివర కీస్పినంపులకే తన్నందరు వెక్కిరించుచున్నపు డిప్పు డేద్చెనా తన్ను బ్రమక నీయరని యతడు దిగ్రమింగి యామెవంకనుండి చూపుతొల గించి తల్లిని తలుపుతీయుము నెను. ఆమె 'ఆ మాదిగ దానిని వెళ్లఁగొట్టుము. ఏబ్రాసిముండ! మన యింటికి వచ్చిన దెందు లకో' అని చెప్పరాని మాటలన్నియు నెను.

ఈలోపుగా నూరంతయు నచటి కొడ్డిగిలెను. రాధ యూరిలోని పెద్దవారిని జూచి 'అయ్యా! నాతండ్రి చని పోయెను. నాదశ యిట్లు పట్టినది. నన్ను మరల నాభర్త గ్రహించునా! నేను కృష్ణలోఁబడి చనిపోవలయునా' యనెను. నిరక్షరకుక్షులయ్యు సనాతనమతసాధస్తంభకల్పులయిన యా పెద్దలు పెదవి కదుప లేదు. చివరకు రాధ రామన్న నడి గెను. 'అయ్యా! ఆంధ్రస్త్రీలు బజారులో భర్తలతో మాటా డరు. కాని నాస్థితి యిట్లు పట్టినది. ఇందు నా తప్పేమియు లేదు. ఇందులో నీ నిలుచున్న పెద్దల కూతుండ్రను గాని భార్యలను గాని యా కరణతురక యట్లు చేసినేని వీరును నావలె నిక్లే 'నమోనమ' యనవలసి నదే గాని యేమియుఁ జేయలేరు. నాతండ్రి ధనవంతుఁ డైనచోఁ జాలమందివలెఁ దాను గూడ నాయీతప్పు కప్పియుండును, కొండపల్లిలో నట్లెంతమంది చేయలేదు. ఈ జగమ్ములో నీదనాకే రక్ష లేదు.

ఇట్టి దుర్మార్గ ప్రపంచమును తిరస్కరించి నన్ను మీరు గ్రహింతురా! లేక నాకుఁ గృష్ణానది గతి చెప్పుదురా యనెను.

రామన్న తనభార్య తెలివితేటలకు ముగ్ధుడైపోయెను. కాక కాక తనకుఁ బెండ్లి యయ్యెను. అందులో మహా సౌందర్యవతి వచ్చెను. తన యదృష్టము గొలది నామె పండితురాలు కూడ నయ్యెను. రామన్నకుఁ దనభార్య నేల వలయు ననియే యనిపించెను. కాని తల్లి తన్నుచంపి గోతిలో పెట్టును. ఊరందరు తన్ను వెలివేయుదురు. పౌరోహిత్యము చేసికొనుచు నలుగురిమీద నాధారపడిన తానంతపని యెట్లు చేయగలఁడు. రామన్న మాటాఁడ లేదు. ఇంతలోఁ దలుపు సందులగుండ నిది యంతయు వినుచున్న యామెయత్తగారు తలుపు తటాలునఁ దెఱచి 'ఎంత గయ్యాళివే! నీవు చెడిపోయి నదిగాక యూరందరినిగూడఁ జెడి పొమ్మందువా! సిగ్గులేక మాటాడవచ్చితివి. పో! పో!' అని యొక వందతిట్లతో కలిపి యీ మాటలనెను. రామన్న తలుపు తీసియుంచుటచేత లోనఁ బ్రవేశించి పోయి దాఁగుకొనెను. అందఱు నవ్విరి. అత్తగారు తలుపు తటాలున మరల వేసి గడియ బిగించి వెడలిపోయెను. రాధ దిగాలుబడి నిలుచుండెను.

అందులోఁ బెద్ద లెవరిదారిని వారు బోయిరి. 'పైలా పచ్చీసు' మీదఁ గుఱ్ఱవాం డ్రామెవంకఁ జూచుచు నవ్వుచు విలాసచేష్టలు చేయ మొదలుపెట్టిరి. రాధ యట్లు గంటనిలచి

కన్నీళ్లతోఁ జివరకు వెనుదిరిగి వచ్చినదారిఁ బట్టెను. ఆమె వెంటఁబడి యువకులు చిన్నిచిన్నిగడ్డలురువ్వను-ఈలలు వేయను సాగిరి. అందులో నాలుగు నెలలు దాటని యాయుఃర్దాయము కలవాఁడొకఁడామెకొంగుఁ బట్టుకొని లాగెను. రాధ వెనుదిరిగి యొకచూపు చూచెను. ఆచూపుతో నా యువకు లందరుఁ గృతయుగమైన మాడిపోయి యుందురు. కాని కలి వారిని రక్షించినది. రాధ మరల వెడలిపోయెను. ఆమెను తరువాత నెవరును వెన్నాఁడలేదు.

రాధ పడవ యొద్దకుఁ బోవునప్పటికిఁ జీకటిపడి ప్రొద్దు వోయినది. పడిప చివరిసారి ప్రయాణమయి పోవుచుండెను. అదృష్టవశమున రాధ యందుకొన్నది. రాతిరి రెండు జాము లగు పోయి రాధ తమయింటి యరుగుమీద నిద్రించెను.

# పదునాలవ ప్రకరణము



హరశాస్త్రి కోటనుండి తిరిగి ప్రొద్దుదాటి వచ్చెను. సుల్తానును వాని దండును మరుగుపడిన వెంటనుండి యతని ముఖ మారజ్యమానమై పోయెను. అతని లోని క్రోధానలము మహావాయుఘాతమై యెగురగొట్టబడినట్లు సహస్రముఖముల విజృంభించెను. ఇంటికిం బోయెను. ఇంటియొద్ద రాధ లేదు. రాధ యేమైపోయినది బిడ్డ తన దుఃఖము భరింపలేక యే గోతిలో నైన దూకలేదుకద. హరశాస్త్రి హృదయము రాధ స్థితి తలంచినకొలది దుఃఖమయమైపోయెను. ఆదుఃఖము నుండి మరలఁ గ్రమక్రమముగాఁ గ్రోధము ప్రజ్వరిల్లెను. ఆక్రోధముచేతఁ దనయొడలు నిజముగా మండుచున్నదేమోయని హరశాస్త్రి తన్నాపాద మస్తకము చూచుకొనెను. మనస్సే తప్ప మానిసి తగులఁబడుటలేదు. తానోర్వరాని యీక్రోధ మెవ్వరికిఁ దెలిసి పోవునోయని యాతఁడు దక్షిణాభిముఖుఁడై కృష్ణానదియొడ్డునకుఁ బోయెను. ఆక్రోధమంతయు నదిలో విసరిపారవేయవలె ననుకొనెను. సాధ్యముకాలేదు. అయ్యో! బ్రాహ్మణునకు శాంతము కావలయును. నాయాత్మ శాంత మార్గమును గాక క్రోధమార్గ మనుసరించుచున్నదియని విచారించును. మరల నతని విచార మతిక్రమించి యాతని మనస్సులో నగ్ని బహుధా చెలరేగెను. ప్రొద్దుగ్రుంకువఱకు

కోపము తీసివేయుటకు హరశాస్త్రి చేసిన ప్రయత్నము లన్నియు వ్యర్థములయ్యెను. సూర్యుఁడస్తమించెను. అస్తమించిన సూర్యుఁడు మంజేపులను రాక్షసులను చంపిన నెత్తురు తనయొడలెల్ల పులుముకొన్నది చాలక కాబోలు కృష్ణానదీశీతల మందమరుత్ప్రచాలిత తరంగ సంతానము నెల్లనా నెత్తురులు ప్రవహింపఁజేసెను. హరశాస్త్రి చూచెను. కాదుకాదు. నెత్తురు కాల్వలు కట్టవలె ననుకొనెను.

అంతలోఁ జీకట్లుపడెను. హరశాస్త్రి "ఛీ! ఛీ! సుల్తానున కేమి తెలియును. వాఁడు బసివాఁడు. గవాను వృద్ధుఁడు. దేశ దేశములఁ దిరిగినవాఁడు. విద్యలు నేర్చినవాఁడు. రాజనీతిజ్ఞుఁడు. ఇది చేయరాని కార్యమని చెప్పరాదా! బ్రాహ్మణవధము మూఢులయిన మహమ్మదీయ మతావిష్టులకు మంచిగాఁ గనవచ్చునుగాక వృద్ధులై చక్కని మనఃపరిపాకము పొందిన గవాను వంటివారికిఁగూడ నంతయిష్టమా! ఛీ! ఛీ! పాపలోకము. అయ్యో! ఒకని మత మొకనికి నచ్చక పోవచ్చునుగాక. ఆ మతములందరిని నరకుమురా! వారికిమాత్రము పెండ్లము బిడ్డలులేరా! వారికాత్మలులేవా! సుఖదుఃఖములు వారికిమాత్రము సమానముకాదా! ప్రత్యక్షమైన సుఖదుఃఖమును నిరాకరించి యేవో యూహానిర్మితమైన యీదైవము కొరకేల యీంగలాడుదురో యీమూఢ మానవులు. ఓయీ! గవాను! నీవెంత సత్పురుషుఁడ వనుకొంటిని. జహానును చంపించుపరము నీకు నిద్రపట్టినదికాదు. రాణిచేత

జహానుమరణము కల్పించితివి. నీమరణ మెట్లువ్రాసియున్నదో యెవరికిఁ దెలియును." అని అనుకొనెను.

ఈ యూహలతోఁ జాల ప్రొద్దుపోయినది. హరశాస్త్రి యేమయినను సరియే గవాను మహమ్మదుషాలకు శిక్ష చేయవలెనని నిశ్చయించుకొనెను. గవానునకు బ్రాహ్మణహత్యచేయునపుడు ముభావము వహించి యూరకొన్నందులకు, మహమ్మదుషాకు రాధను వినాశనము చేసినందులకు, ఈ మహాకార్యమునకుఁ దనలోకజ్ఞత్వము కాక తానునేర్చిన శాస్త్రము లెంతవర కక్కఱకువచ్చునో యూహించుకొన మొదలుపెట్టెను. తన జ్యోతిశ్శాస్త్రము శకునశాస్త్రము మరల మనస్సులో నేకరువుపెట్ట మొదలుపెట్టెను. ఆకాశమున నక్షత్రములను బరిశీలించెను. అన్నియు రాజ్య విప్లవమున కనుకూలముగా నున్నవి. తాను గవానునకు షాకును నామ నక్షత్రములతో గోచారము కట్టెను. అనుకూలముగా నున్నది. దేశముయొక్కస్థితి లెక్కకట్టి చూచెను. తన యూహకు సరిపోయినది. దారివెంటఁ జెట్లమీఁదఁ బలుకు పక్షుల పలుకులు విచారించెను. ప్రతిపక్షియుఁ దనయూహల కనుగుణముగాఁ బలికెను. హరశాస్త్రి కంతకంతకుఁ గోపము పైపొంగు తగ్గిపోయి యాతని మనస్సులో నిలుకడగల జ్వాలగా నొప్పుచుండెను. హరశాస్త్రి యింటిదారి పట్టెను. రాత్రి రెండు జాములు దాటిపోయెను. హరశాస్త్రి యింటికివచ్చి 'ఈ జీవితము శాంతముగా వెళ్ళిపోవుననుకొంటిని. కాని భగవంతుఁ

డ్లు సంకల్పించలేను. నాకు నేబది రెండేండ్లు వచ్చినవి. ఈ నాఁటికి నన్ను దేవదేవుఁడు రాచకార్యములలోనికి దించుచున్నాఁడు. ఈ కర్మబద్ధమైన లోకముతో నాకేటికి? ఊరకుందునా' యనుకొనుచు నరుగుమీఁదఁ బండుకొని నిద్రించు రాధనుచూచెను. రాధ మేల్కని హరశాస్త్రిని గుర్తుపట్టెను. 'తల్లీ పవల్లె నెచ్చటికిఁబోతి'వని హరశాస్త్రి పలుకరించెను. రాధ తా నమరావతికిఁబోవుటయు నచ్చటి వర్తమానమును నెఱింగించెను. హరశాస్త్రికి మరలఁ గ్రోధము చెలరేగెను. అమరావతికిఁబోయి యా యూరు తగులబెట్టవలె ననిపించినది. కాని యీ దుస్థితికంతకు మూలకారకుఁడు సుల్తాను. వానికి దగినశిక్ష చేయవలయునని సంకల్పించుకొనెను. ఇద్దరు చెరియొక యరుగుమీఁద నిద్రించిరి.

శరత్తుపోయి హేమంతము సమీపించినది. చలివేయుచున్నది. ఇంటిలోని కిద్దరును పోలేదు. చిరిగిపోయినకొంగు రాధ కాలుముడుచుకొని కప్పుకొన్నది. పైనున్న యుత్తరీయము సగము పక్కగా సగము దుప్పటిగా హరశాస్త్రి చేసెను.

తెల్లవారునప్పటికి హరశాస్త్రి మొగము శాంతముగా నుండెను, కోపమంతయు నొక్క యాగంభ రూపముపొంది యతని హృదయములో దాఁగియుండెను.

పూర్వము రాధ వండిపెట్టగాఁ జాలనాళ్ళుతిన్న హరశాస్త్రి యిఁక తానే రాధకు వండిపెట్ట మొదలు పెట్టెను. రాధ యింటఁ బైపనులన్నియుఁ జేయును. హరశాస్త్రి 'తల్లీ! నీవు

వంచుము. నాకు వెలిభయము లేదు. నేను తిందును.' అని చెప్పెను. కాని రాధ 'నాయనా! వెలికోసముకాదు. నిజముగా నేను బ్రాహ్మణ్యములకు వెలియయితని. ఈ సంఘము పెట్టు వెలికి నేను వెరువను. ప్రారబ్ధముచేత నాకీ వెలి ప్రాప్తించినది. నేను దానికి వెరచుచున్నాను. నాకీ వెలినుండినిష్కృతి కలిగించుము' అనెను. భీమునికోపము మాటిమాటికి ప్రజ్వలింపఁజేసిన ద్రౌపదీవాక్యములవోలె రాధ ప్రతిపదము హరశాస్త్రికి శూలము నాటినటుండెను. ఆ ప్రతిపదము సుల్తాను చావుదగ్గఱకుఁ దెచ్చుచున్నట్లుండెను. భోజనమయిన వెంటనే హరశాస్త్రి తన ప్రయత్నమునుగూర్చి యాలోచన చేయ మొదలుపెట్టెను.

హరశాస్త్రి నీతినిగూర్చి యాలోచించెను. మూఢుఁడు, సాహసుఁడు, అప్రీతుఁడు వీరివలన నీతి ఫలించ గలదని యూహచేసెను మూఢుఁడు రహస్యము తెలిసికొనలేఁడు గాన వాఁడు నీతి ప్రయోగించువానికిఁగావలసినవాఁడు. వానియొద్ద నున్నరహస్యము పెట్టెలోదాచినసగవంటిది. రెండుసాహసుఁడు. ముందువెనుక లాలోచించక యేపనినైనను చేయువాఁడు వీఁడున్నచోఁ దలకొన్నపని వెంటనేచేయును. అనుకొన్న పని నైనతరువాత సర్వజనులు దిగ్భ్రాంతులయి పోదురు. దానికిఁ బ్రతీకారముచేయ నూహించువాఁడుండు.

మూఁడవవాఁడ ప్రీతుఁడు. ఎవనిహృదయములోనికోర్కి యసంపూర్ణగా నుండునో వానివలనఁగూడ నీతి ప్రయో

గించవచ్చును. వానికి వానికొక్క సమకూడునని యాశపెట్టి నచో వాడును లొంగివచ్చును. వీరుముగ్గురు నీతి ప్రయోగమున కావశ్యకులు. అని హరశాస్త్రి మనస్సులో నిశ్చయించెను. ఇంతవరకు లక్షణము కుదిరెను. లక్ష్యమునకై విచారింప మొదలువెట్టెను.

మొట్టమొదట నత్రీతుఁ డెవఁడాయని విచారించెను. భీమరాజని మనస్సులోనాటెను. సుల్తాను నమాజుచేయువేళ భీమరాజు నెమ్మదిగాఁ దొలగిపోవుట హరశాస్త్రి గుర్తించెను. అతనియందప్రీతి గోచరించుచున్నది. అతఁడొకఁడు ముఖ్యుఁడు. అతని నెక్కడనో పట్టుకొనవచ్చును. ఇంకసాహసుఁడు మూఢుఁడునుఁ గావలయును. వారు సుల్తానుకొల్వులోనున్నవారు కావలయును. సుల్తాను కొల్వులోని వారితో నేనాటిదో వెనుకటి పరిచయము హరశాస్త్రి కక్కఅకుర్రాదు. కావున మరల సుల్తాను కొల్వునకు రాకపోకలు సాగించవలయును.

ఆనాఁడే నేలువకప్పుకొని హరశాస్త్రి సుల్తానుదర్శనము గవాను దర్శనముచేసెను. గవాను హరశాస్త్రిని పరిశీలించిపరిశీలించిచూచెను. హరశాస్త్రి హృదయములోని యారంభమంతకంతకు దృఢము కాఁజొచ్చెను. హరశాస్త్రి నాఁడుమొదలు శకునశాస్త్రము సాముద్రికము జ్యోతిషము యథేచ్ఛగాఁ బ్రతివానికినఁ జెప్ప మొదలుపెట్టెను. ఇట్లు నెల గడచెను. నెలనాళ్ళకే రాధ యాపద బ్రాహ్మణ వధము

సుల్తానుకొలువులోఁ బ్రాంతసంగతుఁడై పోయెను. కానియువి రెండును గ్రామమునకు దక్షిణమున నున్న గోపన్నయింటిలో రెండు కంచుకాగడాలై వెలుగుచుండెను.

మహమ్మదుషాకు హరశాస్త్రియందు నమ్మకము కుదిరెను. షాకూడఁ దనకువచ్చిన రెండుస్వప్నములకు ఫలితములు చెప్పించుకొనెను. హరశాస్త్రి చెప్పిన ఫలములవలన షా యుత్తర హిందూస్థానమంతయుఁ గెలుచును. వేలకొలది బ్రాహ్మణులను వధచేయును. ఎంతమందినైన స్త్రీలను చెరబట్టును. షా యీఫలితములకుఁ జాలసంతోషించెను. సంతోషించిన కొలఁది హరశాస్త్రిని దగ్గరకుఁదీసెను. దగ్గరకుఁ దీసినకొలఁది హరశాస్త్రియతనిఁదనవశము చేసికొనఁజొచ్చెను. హరశాస్త్రిమాటమీఁద సుల్తాను కావలసినచో గవానునైనఁ జంపును. హరశాస్త్రి సుల్తాను నట్లుచేసెను.

---

# పదునేడవ ప్రకరణము

మహమ్మదుషా తనచేతులతోఁ గాఫరులను జంపెను. గానన తఁడు ఘాజీయను బిరుదును వహించుటకుఁ దగినవాఁడని యాబిరుదును గవాను మహమ్మదుషాకిచ్చెను. ఆనాఁటి నుండి మహమ్మదుషాఘాజీగా సుల్తానుపిలువఁబడు చుండెను. దీనితో హరశాస్త్రికి గవానుమీఁద నున్న కొంచెము అనుమానము పూర్తిగాఁ బోయెను. ఇదివరకు హరశాస్త్రి యొక వేళ సుల్తానుచేసినదానికి గవాను ఏమిచేయ గలఁడని యనుకొనెను. ఆసంశయ మిప్పుడు నివృత్తి యయ్యెను. హరశాస్త్రి నీతిఖడ్గము గవానున కభిముఖముగాఁ బోవుచుండెను.

కంచి పుణ్యక్షేత్రము కొండపల్లికి దగ్గరలో నున్నది. అది చెన్నపట్టణమునకు నలుబదిరెండు మైళ్లలో నున్నది. ఈ క్షేత్రము దక్షిణాపథమున నొకమూల నుండుటచేత నేమహమ్మదీయుని యొక్కయుఁగన్ను దానిమీఁదికిఁబోలేదు. ఆక్షేత్రములో మహాధనరాసు లున్నవనియు నా దేవుని యొడలెల్ల బంగారపుఁ దొడుగు లున్నవనియు జనులు చెప్పు కొన సాగిరి. ఆక్షేత్రమును దోచుకొన వలెనని సుల్తానునకు బుద్ధి పుట్టినది.

ఒకనాఁడు పాదుషాకు నొక కలవచ్చెను. అతఁడు కత్తి పుచ్చుకొని యిరువదివందలమంది బ్రాహ్మణులను నరకినట్లును

వారికడుపులలో నుండి వేలకువేలు ధనరాసులు బహిర్గతమై నట్లును దోచెను. హరశాస్త్రి నీకల కర్థమేమని యడిగెను. హరశాస్త్రి సుల్తాను కంచిక్షేత్రమునకుఁ బోయి యచటి బ్రాహ్మణులనుడంపి యాక్షేత్రమునందలి దేవాలయముల లోని మహాధనరాసులు త్రవ్వితెచ్చుటయే దానిఫలమని చెప్పెను. సుల్తాను హరశాస్త్రితో 'మీకన్న మాకుమిత్రుఁడు న్నాప్తుఁడు లేఁడు. మీ చెప్పిన మాట ఖురానులోని మాట. దాని విషయమున మాకు సంశయములేదు' అనెను. హర శాస్త్రి నిజమేనా యనెను. సుల్తానునిజమేయని ప్రమాణము చేసెను. అట్లయినచో 'ప్రభువులకొక రహస్యము చెప్పెదను' అని యూరకుండెను. సుల్తా నూరకుంటివేమి చెప్పుడనెను. హరశాస్త్రి 'నాకెందులకు? ప్రభువులు నమ్మరు సరిగదా కోపముకూడవచ్చు' ననెను. రాదు చెప్పుమని సుల్తానడిగెను. 'మీరు కంచిగెలిచి వచ్చినతరువాతఁ జెప్పెద'నని హరశాస్త్రి చెప్పెను. కాదుకూడదని సుల్తానెంతబలవంత పెట్టినను 'మీరు కంచికి బయలుదేరిన నాడు చెప్పెద'ననెను. సుల్తాను కంచికిఁ బోవు ప్రయత్నములు చేయ మొదలుపెట్టెను.

కృష్ణా గోదావరుల మధ్యనున్న రాష్ట్రమంతయు బీదరు సుల్తానులక్రింద నుండవలయును. బందరు విజయనగ రపు రాజులక్రింద నున్నది. కావున సుల్తాను దానిని జయింప వలె నని హరశాస్త్రి మహనాఁడు సుల్తానుతోఁ జెప్పెను.

సుల్తాను హరశాస్త్రికిఁ దనయందుగల రాజభక్తి యెడల నున్న విశ్వాసము బహుళ మయ్యెను.

వెనుక నంభోజరాజును వెంటఁ గొనివచ్చి రాజమహేంద్రవరము కొండపల్లియు గెలువుమని బోధనచేసినదితఁడే. కంచికిఁ బొమ్మన్నది యితడే మరల బందరు గెలువమన్నది యితఁడే. సుల్తాను. కంచిదండయాత్రయు, బందరుదండయాత్రయు నొక్కసారి యెట్లు సాగున నెను. హరశాస్త్రి యాసంగతి తనకు వదలు మనెను. సుల్తాను నాశ్చర్యపోయెను.

గవానునకు బిడ్డలు లేరు. అందుచేత నతఁడొకకుఱ్ఱవానిని బెంచుకొనెను. అతనిపేరుయూసఫ్ఆదిల్ ఖాన్. అతనికిరువదియేండ్లు. వాని యెడల గవానునకు మిక్కిలి ప్రేమ. హరశాస్త్రి యానాఁడు గవానును జూడబోయి యాచారములు నెరపిన తరువాత నిట్లనెను. "సాహెబ్ జీ! సుల్తానునకు బందరు గెలువవలెనని యున్నది. ప్రభువు కంచిమీఁదికిఁ బోవుచుండెను. గాన బందరుమీఁదికిఁ బోవుట కెవ్వరు లేరని యాలోచించుచుండెను. నేను తమ కుమారుని పంపుడని చెప్పవలెననుకొన్నాను. కాని మీయనుమతి లేక యేమని చెప్పను. మీ యనుమతికై వచ్చినాను."

గవానునియాత్మ సంతోషించెను. 'చిత్తము! మీరు నాయందుఁ జాల ప్రేమకలవా' రనెను. హరశాస్త్రి 'యది నా ధర్మము' అనెను. తరువాత హరశాస్త్రి సెలవుఁదీసికొని పోయెను. గవానునకు హరశాస్త్రిపై గల యనుమానము తీరిపోయెను.

కంచి మీఁదికి సుల్తాను పోవునప్పుడు బందరు మీఁదికి యూసఫ్ ఆదిల్ ఖాను వెళ్ళునట్లును యేర్పాటు చేయఁబడెను. ఆదిల్ ఖానువెంట గవానుకూడ రహస్యముగ పోవునట్లు నిర్ణయింప బడెను. సుల్తాను సేనలోనున్న మెరికలవంటి వారిని నాలువేల మందిని తనవెంటఁ దీసికొనిపోవునట్లును, యూసఫ్ ఆదిల్ ఖాను ఆరువేల మందిని బందరునకుఁ దీసికొని పోవునట్లు నిర్ణయించెను. కొండపల్లిలో హరశాస్త్రి యుండవలయును.

కంచికిఁ బోవునాఁడు సుల్తాను హరశాస్త్రిని పిలిచి 'ఆరహస్య మేమి'యని యడిగెను. అంతకుముందే గవానును యూసఫ్ ఆదిల్ ఖానును బందరునకుఁ బోయిరి. హరశాస్త్రి యీసంగతి యెఱిగినవాఁడగుటచే నిట్లు చెప్పెను. "ప్రభూ మీయందు జహాను రాగుఁడ నగుటచే నేను చెప్పుచున్న మాటలకు మీకుఁ గోపము వచ్చినచో నేను చేయునది లేదు. అయినను చెప్పుచున్నాను. మీ యన్నగారు చని పోవరని మీరు సుల్తాను లగుదురని పూర్వమే నేను జోస్యము చెప్పితిని. అది తెలిసి జహాన్ మిమ్ము [illegible] దీసి మీ స్నేహము సంపాదించెను. ఆస్నేహము గవానునకుఁ గష్టముగా నుండెను. అందుచేత రాణిగారి చెవిలో జహానును గుఱించి దుర్వార్తలు చెప్పి తమచేత నతనిని జంపించెను. నిజమైన మాటకు జహాను చేసిన తప్పేమో నాకుఁ జెప్పుఁడు" అని యడిగెను. సుల్తా నూహించెను. జహాను చేసిన తప్పే [illegible]

హరశాస్త్రి మరల ననెను. "ప్రభూ! నిజమైన మాటకు జహాను మిమ్ము ప్రేమించెను. మిమ్ము చేతులలో నెత్తి కొని పెంచెను. మీకుఁ గత్తిత్రిప్పుట స్వారిచేయుట, ఖురాను చదువుట నేర్పినది జహాను గదా! మిమ్ము మహమ్మదీయ మతాభిమానులుగాఁ జేసినది జహాను. అతఁడు మిమ్మెంతగాఁ ప్రేమించెనో యాలోచించిన మీకేఁ దెలియును." సుల్తా నాలోచించి 'అవు నవును' అనెను. హరశాస్త్రి మరల మొదలు పెట్టెను, "నిజమునకు జహానునకు నాకు విరోధము. అది తమకును దెలియును. కాని యదార్థము చెప్పు చుంటినిగాన నతనియెడ నా విరోధమును నేను పాటించుట లేదు' సుల్తాను నిజమే యనుకొనెను. హరశాస్త్రి యిట్లు చెప్పెను. "జహాను ప్రేమించినంత గవాను మిమ్ముఁ బ్రేమించె నా! పర్షియా దేశీయునకుఁ దన ధనమునందు నధికారము నందు నున్నంత చూపు దక్షిణదేశపు నవాబుమీద నుంచునా! మీరు కొండపల్లి ముట్టడివేసి నప్పుడు మాకు సాయము వచ్చెనా! ఇప్పుడు మీరు కంచికిఁ బోవుచుండఁ దన కొడుకు వెంటఁ బోయెను గాని మీవెంట వచ్చెనా! ఆలోచింపుడు." సుల్తానున కాలోచన యెక్కు వయ్యెను.

హరశాస్త్రి "నాకొక విషయమున ననుమానముగా నున్నది. మీరుకూడ విచారింపుఁడు. ఏమంత్రుల సాయము లేకుండఁ గొండపల్లి కోట తిరుగఁ బడెనా! మీవలన రాజ్యముసంపాదించిన గజపతి మరల మీ మీదకు దండెత్తి

వచ్చెనా! క్షేమరాజు నాయుష్ప్రాయ మెంత? వానిశక్తి యెంత? వాఁడు ఆరునెలలు కోట మీఁదస్వాధీనము కానీయకుండ నుంచునా! వాని షగతులేమి? మీముందటఁ జేతు మోకరించి నిలుచుండెఁ గదా! మీ మన్త్రులలో వాని కెంతో పరీక్ష లేక పోయిన యెడల నతఁడెన్నఁడు నిశ్చయముగా మీముందు దోసిలింబడి మాట్లాడ గలఁడా" అనెను. సుల్తానునకు హరశాస్త్రి చెప్పినదంతయు నిజమనిపించెను.

హరశాస్త్రి "నాకుఁ దోఁచినది చెప్పితిని. గవాను మహానుభావుఁడు. అతఁడట్టివాఁడు కాఁడు. అయినను రాజు తన క్షేమము విచారించుకొనుట ప్రధానము. రాజభక్తి కల వాఁడు తనకుఁ దోఁచిన సంగతులు మనవి చేసికొనుట తప్పు కాదు గదా!" సుల్తా నాలోచించుచుఁ గదలి పోయెను.

కంచికిఁ గొండపల్లి నుండి పదిరోజుల ప్రయాణము. సుల్తాను పోయినకొలఁది కంచిదేవుని ధనముపందలి యాశయుఁ గవాను మీఁద కోపమును నెలరేగెను. అతని మనస్సు రథవేగమునఁ బ్రవహించుటచేత నతని దేహములోని నెత్తురు కూడ నంత వేగముగానే ప్రవహించుచుండెను. అతనితో సైన్యములు నడువలేక పోయెను. చివరిరోజున నైజాముల్ ముల్కు ఖైరియును యూరిపఖానుఁడను నింకొక సేనానియుఁ దక్క వేరొకఁడాతనితో నడువలేక పోయెను.

కంచి దేవాలయమున దేవుని ధనము రక్షించుటకుఁ గొంతమంది సైనికు లుండిరి. వారిలోఁ గొందరు బయటకు

వచ్చిరి. సుల్తాను నలుబది మందితో మాత్రమే దేవాలయము నొద్దకు ముందు చేరెను. సైన్యమంతయు వెనుక వచ్చుచున్నది దేవాలయ రక్షక సైన్యములో నొక యాజానుబాహుఁడు తన గుఱ్ఱమును సుల్తాను మీదికి దూకించి యీటెతో సుల్తానును బొడువఁబోయెను. కాని యతఁడా దెబ్బ తప్పించుకొని వానిని కత్తితో నరికెను. వాఁడు చనిపోయిన వెంటనే యింకొకఁడు సుల్తానును జంపవచ్చెను. కాని వానిని గూడ సుల్తాను నరకెను. తరువాత మరికొందరు హిందువులు చచ్చిన వెనుక హిందువులందరు దేవాలయము లోనికిఁ బోయి తలుపులు వేసి గోడలెక్కి మహమ్మదీయులపైఁ గత్తులు నీటెలు రాళ్లు విసరఁ జొచ్చిరి. ఇంతలో సుల్తాను యొక్క యాఱువేల సైన్యము వచ్చెను. ముట్టడి ప్రారంభమయ్యెను. చివరికా యపరిమిత సైన్యము దేవాలయపు గోడలు కుద్దలించి లోనికిఁ బ్రవేశించి యచ్చటికొలది సైన్యమును పూజారులను బ్రాహ్మణులను ముక్కలు ముక్కలుగా నరకవైచిరి. దేవాలయములో భగవంతునికి జవాహిరీ లక్షయుండెను. కాని మహమ్మదీయులు వెండిబంగారము రత్నములు తక్క వేరేమియు ముట్టుకొనలేదు.

తరువాత సుల్తాను కంచి కొల్లగొట్టెను. అంగడులన్నియు దోచెను. ధనవంతుల యిండ్లు పడగొట్టెను. వారి స్త్రీలను చెరపట్టెను. కొన్ని యిండ్లు కాల్చెను. దుఃఖించుచుఁ బ్రార్థించుచువచ్చిన వారిని జంపెను. కాని కోపము సూచిం

చిన వారిని చిత్రవధ చేసెను. ఈరీతి వధయు కొల్ల కొట్టుటయు కంచిలో సుల్తాను వారమురోజులు చేసెను. ఆ వారము రోజులలో వతనికి, బదికోట్ల రూపాయీల విలువగల బంగారము వెండియు మరికొన్ని కోట్ల వెలగల రత్నములును దొరకెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము

మహమ్మదుషా కంచికిఁబోయిన వెంటనే హరశాస్త్రి మూఢులను సాహసులను వెనుకఁజొచ్చె. వెనుక జహానును చంపినవాఁడెవఁడని వాకబుచేసి వానిని గనుగొని వానియొద్దకుఁబోయెను. హరశాస్త్రి తనయింటికి వచ్చెనని వాఁడుచాల గౌరవము చేసెను.

హర——వెనుక జహానును చంపినది నీవేనటగా!

వాడు——చిత్తము.

హర——నిజముగా నట్టిపని చేయుట కెంత సాహసముండవలయును. సుల్తానును నీవలెఁ ప్రేమించు వాఁడింకొకఁడుండునా!'

ఈ మాటల కుబ్బిపోయి వాఁడు హరశాస్త్రిని చాల గౌరవించెను. తరువాత హరశాస్త్రి వానితో నదియునదియు మాటాడి వెడలిపోయెను. తరువాత నాలుగైదు రోజులవఱకు వాఁడెచ్చటఁ గనంబడిన నచ్చట వానిని హరశాస్త్రి గౌరవింప మొదలుపెట్టెను. వాఁడు దానికి వినమ్రుఁడై హరశాస్త్రి యేపని చెప్పిన నది చేయుటకు సిద్ధముగానుండెను

ఒకనాఁడు హరశాస్త్రి వానితో "నీవు సుల్తానునకంగ రక్షకుఁడవుగదా! కంచికిఁ బోలేదే" మని యడిగెను. వాఁడు సుల్తాను రావలదనెనననెను. హరశాస్త్రి సుల్తానున కిప్పుడట్టి యాపదవచ్చినచో నీవు జహానును చంపినట్టిప్పుడుకూడఁ జంపుదువాయనెను. వాఁడందులకు సందేహమాయనెను. హరశాస్త్రి 'నేనైనను చంపెదవా' యనెను. వాఁడు— "అంతమాట యెందులకు? తమరు సుల్తానునందు భక్తికలవారుగదా" అనెను. హరశాస్త్రి 'అది సరిలే. ఒకవేళ నేను సుల్తాను నెడల దుర్మార్గముగాఁ బ్రవర్తించుననుకొనుము. నీవు నన్ను సుల్తాను చంపుమనినఁ జంపుదువా' అనెను, వాఁడు చిత్తము. సుల్తానామాట యన్నచోఁ జేసి తీరవలయు' ననెను.

హర—'గవాను నైనను జంపెదవా' అనెను. వాఁడు దానికిని వల్లెయనెను. హరశాస్త్రి వానిని 'జ్ఞాపక ముంచుకొనుము. సుల్తానున కాపద రానున్నది. నీ కత్తి యానాటికి వెనుక పడరాదు' అనెను. వాఁడు దృఢనిశ్చయముతో హరశాస్త్రివంకఁ జూచెను,

హరశాస్త్రి యింక మూఢులవంకకుఁ దన దృష్టి త్రిప్పెను. నాల్గురోజులలో సుల్తాను పరిచారకులలో నుద్యోగులలోఁ బది మంది మూఢులనేరెను. గవానుదగ్గరఁ బక్షపాత ముగ్ల దనియు నతఁడు పర్షియాదేశస్థుఁ డగుటచే దక్షిణదేశపు మహామ్మదీయులకు విరోధియనియు వారికి బోధించెను. వారిది వరకే యతనియెడలఁ గ్రోధులు గనుక తొందరలో హరశాస్త్రి మార్గమునకు వచ్చిరి. హరశాస్త్రి తన వాక్చాతుర్యముచేత గవాను నెట్లైన వదలించుకొనవలయునని వారిచేతనే యనిపించెను. కాని వారు అది మాచేతఁగాదు. మీరు సహాయము చేసిపెట్టుడని యడిగిరి. హరశాస్త్రియు సంతసము కొప్పుకొనెను.

గవానున కబిసీనియాదేశపు బానిస యొకఁడుండెను. మంత్రి మొహరు వానియొద్ద నుండును. వాఁడు గవానునకు నమ్మకముకల పరిచారకుఁడు. హరశాస్త్రి వానియొద్దకుఁ బోయెను. వాఁడు చాల గౌరవించి హరశాస్త్రికిఁ దనచేయి చూపెను. హరశాస్త్రి వానికి వాఁడు స్వప్నమునందైనఁ గాంచరాని యైశ్వర్యము ప్రభుత్వము చెప్పెను వాఁడు పెదవి విరిచి 'నాకివి యన్నియు నక్కఱలేదు. నా ప్రభువు గవాను బాగుండవలెను' అనియెను. హరశాస్త్రి 'అది నీలోనే యున్నది. గవాను మొహరును జాగ్రత్తగా వాడవలయును. అది యెవరికిని జూపకుము' అని చెప్పెను.

ఆ సాయంతనమునఁ గుత్రదాసులలో నొకఁడు వానిని తనయింటికి విందునకుఁ బిలిచి వానికిఁ దగఁ ద్రావఁబోసెను. బానిసవాఁడు మత్తెక్కిపోయి యుండినేని మతితో నుండెను. ఈస్థితిలో వాఁడు తన యింటికిఁ బోవుచుండెను. వాని వెంటఁ గుత్రదాసులలోని వాఁడును వచ్చుచుండెను. హరశాస్త్రి వాని వెంట గవాను సింటికిఁబోయి 'మొహరు జాగ్రతసుమా! ఎచ్చట దాచితివి' అనెను. వాఁడీదిగోనని మొహరు తెచ్చి తూలుచు హరశాస్త్రికిఁ జూపించెను. ప్రక్కనున్న కుత్రదాసు తెల్లకాగిత మొకటిదివరకే సిద్ధపరచినదానిమీద మొహరు గ్రుద్దుము. ఎట్లుండునో చూతము' అనెను. త్రావియున్న బానిస 'పిచ్చివాఁడా! ఇంతమాత్రము తెలియదా' యని మొహరాకాగితముమీద గ్రుద్దెను. వాఁడుచాల బాగున్నదని పటుపటు చూపి చివరకు తన తలపాగలో నా కాగితము చూడకుండ దాచుకొనెను.

తరువాత హరశాస్త్రి భీమరాజుకొఱకు వెదకెను. అతఁడు అమరావతిలో నున్నాఁడని తెలిసి తాను స్వయముగా నచ్చటికిఁబోయి యతనితో మాటలాడెను. తనపన్నాగమంతయు వానికిఁ జెప్పెను. ఇందులో భీమరాజు ప్రాణములుపోవుటకు కూడ సిద్ధపడవలెననెను. భీమరాజు 'నా కనులయెదుటనిరువది మంది బ్రాహ్మణులను నరకినవాఁడు నశించుమార్గమే యున్న నేనెట్టిపనినైనను జేయుదు' ననెను. హరశాస్త్రి భీమ

రాజులు కలసి కొండపల్లి వచ్చిరి. భీమరాజును నిక రహస్యముగా నుంచఁబడెను.

కంచినుండి సుల్తాను సరిగాఁ నెలకుఁ దిరిగి వచ్చెను. బందరునుండి గవా నంతకు ముందు రెండు రోజులనాఁడు వచ్చెను. బందరును యూసఫ్ ఆదిల్ ఖాన్ గెలిచి యాపట్టణమును సుల్తాను రాజ్యములోఁ గలిపెను. సుల్తాను కొండపల్లి చేరిన వెంటనే హరశాస్త్రి యతని దర్శనము చేసెను. కంచిలో సుల్తానునకు దొరకినధనమింతయని హరశాస్త్రి సుల్తానుతోఁ జెప్పెను. సుల్తానాశ్చర్యపోయెను.

హరశాస్త్రి సుల్తానునకు జ్యోతిషము చెప్పెను. 'ప్రభువా! ఈనాఁటిరాత్రి నీకుఁ గల యొకటి వచ్చును. ఆ కల యిట్లుండును. నీవు తెల్లని గుఱ్ఱముమీఁదఁ బోవుచుందువు. నీవెనుక నల్లని గుర్రముమీఁద దీర్ఘకాయుఁ డొకఁడు వచ్చుచుండెను. వాఁడు నీకు స్నేహితుఁడుగాఁ గనంబడును. వాఁడు కొంతసేపటికి నిన్ను కత్తితోఁ బొడుచును. కాని నీ కాదెబ్బ తగులదు. ఈ కల ఫలిత మేమనగా నిన్ను రాజ్యభ్రష్టునిఁ జేయుటకు నీ సరదారులలో నెవఁడో ప్రయత్నము చేయునన్నమాట, కాని వాని ప్రయత్నము నిష్ఫలమగును. దానియర్థమిది. ఈరాత్రి నీకట్టి కలయే వచ్చినచో నేను చెప్పినదంతయు జరుగును.' హరశాస్త్రి యీ కల మాట ప్రొద్దు క్రుంకకముందు సుల్తానుతోఁ బదిసార్లు చెప్పెను. ఇట్లు జరుగును ఇట్లు జరుగును అని సుల్తాను మనస్సుమీఁదఁ

దన మాటలు హరశాస్త్రి మాటిమాటికి ముద్రలు వేసెను. ఆ రాత్రి సుల్తాను తన కలమాటయే తలచుకొనుచు శయ్యకుఁ జేరెను.

కంచిదేవునిది యెంతసామ్ము తెచ్చుకొన్నను తన సరదారులే తనయెడ ద్రోహము చేయుచున్నారని తలఁచుకొన్నపుడెల్ల సుల్తానునకా యుత్సాహము లేకపోయెను. తన మీదఁ గుట్రచేయు సరదారెవ్వఁడు? వానిని నరకి కాకులకు గ్రద్దలకు వేయింతు ననుకొనెను. కాని కల రావలయును గదా! వచ్చినచో హరశాస్త్రిమాట నమ్మవచ్చును. అనుకొనుచు సుల్తాను నిద్రవోయెను. అతఁడారాత్రి చాల కలలు గాంచెను. అందులో నొకచోట హరశాస్త్రి చెప్పిన సంగతియు జరిగెను.

సుల్తాను లేచినవెంటనే యతని కాస్వప్న మూహకు వచ్చెను. అతని కాశ్చర్య మయ్యెను. 'అరే! హరశాస్త్రి చెప్పినట్లే యీ కల వచ్చెనుగదా? హరశాస్త్రి యింతటి మహానుభావుఁడు గనుకనే మాతల్లి నన్నితనితో స్నేహముగా నుండుమన్నది. నామీదఁ గుట్రలు పన్ను సర్దారెవఁడు? ఆహా! యీ బ్రాహ్మణుఁడు మహమ్మదీయుఁడైనచో నెంత బాగుండెడిది. బ్రాహ్మణుల కింత జ్ఞాన మెచ్చటిది.' అని యేవేవో తలపోయుచుండెను. ఇంతలో హరశాస్త్రి వచ్చి కల వచ్చిన సంగతి సుల్తానువలన దెలిసికొని 'ప్రభూ! నేనూరికిఁ బోవుచున్నాను. నాలుగైదురోజులవఱకు రాపీలు

లేదు. కుట్రదారులయెడ దయ తలంచరాదు. ఆ కుట్రదారు నేనని తెలిసినను సరే వెంటనే నన్నైనను జంపవలయును సుండీ! అది రాజనీతి' అని చెప్పి సెలవు తీసికొని పోయెను.

జహానును చంపిన యూసుఫ్‌షాహానియొద్దకుం బోయి వానితో మాటాడినట్లు మాటాడి సుల్తాను కల, దాని స్థితి తమ కుట్రదారును చంపుటకు సుల్తాను కృతనిశ్చయుడగుటయు వానితోఁ జెప్పి సుల్తాను నాజ్ఞ వెంటనే నిర్వర్తించుటకు నీ వొక్కడవే తగుదువని వానిని హెచ్చరించెను. హరశాస్త్రి యూసు వదలి పోయెను. వెడలిపోయి రెండు రోజు లయ్యెను. అత డెచ్చటికిఁ బోయెనో తెలియదు.

కుట్రదారులు భీమరాజును చేతులు కట్టి సుల్తాను నెదుటకుఁ దెచ్చి యూనాడు ఇట్లనిరి. "ప్రభూ! ఇతడు కొండపల్లికోటలో దాగియుండిన గజపతుల సేవకుడు. కోట తమవశ మైనప్పటినుండి యెక్కడను గానరాక నేడు గవాను సాహెబుగారి యింటనుండి పోవుచుండగా మేము పట్టుకొంటిమి. ఇతని విషయమున మా కనుమానముగా నుండి తెచ్చితిమి."

సుల్తాను భీమరాజును "నీ వెందుల కుంటివి? ఏమి చేయుచుంటివి" అని బెదరించెను. అతడు భయగ్రస్తుడువలె నటించి చివరకు గవానుగజపతుల కుత్తర మిచ్చెననియు నది తీసికొనిపోవుచు వీరిచేతఁ బట్టుపడితిననియుఁ జెప్పెను.

సుల్తానాయుత్తరము చూపుచునెను. భీమరాజు తన యంగీ మడతలలోనుండి యొక యుత్తరము తీసి యిచ్చెను. సుల్తాను చదివెను. అందిట్లున్నది:-

శ్రీ శ్రీ గజపతులవారికి:—

"ఈ మహమ్మదుషా చేయు క్రూరపుబనులు బ్రాహ్మణవధలు స్త్రీలను చెరపట్టుటలతో నాకు వీనియెడల నసహ్యముకలిగినది. దక్షిణహిందూస్థానము చాల ప్రయత్నములేకుండనే మీరు జయింపనచ్చును. రాజమహేంద్రవరపు ఎల్లలయందు శౌర్యముగల సేనానాయకుడెవ్వఁడును లేఁడు. ఆ భాగము మీరు దండెత్తి లోబఱచుకొనవచ్చును. ఇచ్చట నెక్కువమంది సేనానాయకులు సేనలు నావశమందుండుటచేత నేనును మిమ్ముఁ జాలఁ బెద్దసేనతో వచ్చి కలిసికొందును. మన మిద్దఱము కలిసి యీ రాజ్యమును గెల్చిన తరువాత మనమిద్దఱము చెరిసగముగా నీరాజ్యమును పంచుకొనవచ్చును." ఈ యుత్తరముక్రింద గవాను మొహరుండెను.

సుల్తాను నిలువెల్ల మండిపోయెను. అతఁడు తన యంతఃపురములోనుండెను. అది సభకాదు. వెంటనే గవానును బిల్చుకొని రమ్మనెను. గవానునకు సుల్తాను పిలుపు వెళ్లెను.

అప్పుడు గవాను తన మిత్రులతోఁ గూర్చుండి మాటలాడుచుండెను. వారు సుల్తాను కోపమును గుట్టును బసిపట్టిరి.

గవానును పోవలదని వారించిరి. గవాను 'స్నేహితులారా ! అట్లుకాదు. నేను కొల్చిన బీదరుసుల్తానులలో నితఁడు నాల్గవ వాఁడు. నా యీగడ్డమువారి సేవలోనే తెల్లబడినది. భగవంతుఁ డట్లే కోరినచో నీ గడ్డమువారి సేవలోనే నెత్తురు చేతనెఱ్ఱ పడనిందు" అని సుల్తానుకడకు తడచెను.

ఈలోపుగా సుల్తాను తన కలయు హారశాస్త్రి జోస్యము గవాను జహానును జంపించుటయు వీనినిగురించి యాలోచించుకొనుచుఁ గ్రోధమూర్తి యగుచుండెను.

గవాను ద్వారమునొద్ద గనఁబడెను. సుల్తాను త్తరమును గవానుమీద విసరి యీ యుత్తర మెవరు వ్రాసినదని యడిగెను. గవాను దానినిజదివి "ప్రభూ ! ఈ మొహరు నాదే కాని యీ యుత్తరముమాత్రము నేను వ్రాయలేదు" అనెను. సుల్తాను "ఛీ ! రాజద్రోహీ ! ఇదిగో నిన్ను జంపుటకు ఉత్తరువు ఇచ్చితిని" అనెను

సుల్తాను ప్రక్కనున్న యంగరక్షకుఁడైన యాత్తరాహుఁడు జహానును త్రుటిలోఁ జంపిన యోధుఁడు సింగమువలె గవానుమీదికి దుమికెను. గవాను తనమీదికి దుమికిన యాత్తరాహునిఁ దనఖడ్గము దూసి దూరమున నిలువఁబెట్టి సుల్తానుతో నిట్లనెను. "సుల్తాన్ ! నామాట యొక్కటి వినుము. నావంటి ముసలివాఁడు చచ్చినచో భూమికి లోపము రాదు. కాని నేను చనిపోవుట నీరాజ్యముపోవుట. నీప్రతిష్ఠ పోవుట" యనెను. సుల్తాను 'ఛీ! ఛీ! యనెను.

గవాను తనచేతిలోఁ గత్తి పాఱవైచి మక్కావైపు నకుఁ దిరిగి మోకరించి "దేవుఁడొక్కఁడే. అతని ప్రవక్త మహమ్మదు" అని ధ్యానించెను. జౌహరాహాని యెదురు లేని భయంకర ఖడ్గము గవాను కంఠమును మొండెము నుండి వేరుగాఁజేసెను. సుల్తాను రెండునిముసములాగిశవము వంక నిదానించి చూచి యంతఃపురములోనికిఁ బోయెను.

సుల్తానునకుఁ గ్రోధముగ లేచె. గవాను తన సొమ్మంతయుఁ గాజేసి యుండెననియు నతనియొద్దనుండి మరలనాధన మంతయు రాఁబట్టుకొనవలెననియు నహమ్మదాబాదునకుజను లను బంపెను. నాలుగైదు నాళ్లలో వారు తిరిగివచ్చిరి. దేశ మంతయు గవాను చావునకు గోలలెత్తుచుండెను. ఆ తిరిగి వచ్చిన యుద్యోగులు సుల్తాను నెదుటికి వచ్చిరి.

సుల్తాను...గవాను నింటిలోని సొమ్మంతయుఁ దెచ్చిరా!

ఉద్యో—ప్రభూ! అతని యింటిలో సొమ్మేలేదు. స్వామీ! వారియిల్లంతయు వెదకితిమి. ఇంటిలో వంటఁజేసి కొనునవికూడ మట్టిపాత్ర లే. అతని ధనమంతయు దానము క్రిందనే యయిపోయినది. ఇంటఁ జిల్లిగవ్వయయిన లేదు.

సుల్తాను—అతని పుస్తక భాండాగారముఁ జూచితిరా! అతని ధనమంతయు నా భాండాగారమునకుఁ బెట్టెనట?

ఉద్యో—ప్రభూ! అతనిభాండాగారమంతయు బీదరు విశ్వ విద్యాలయమునకు దానముచేసెను. ఒక్క గ్రంథమైన నాతని యింట లేదు.

మహమ్మదుషాకు మార్దవపు రిమ్మ మొదలుపెట్టెను. అతఁడుద్యోగులను పంపించి తాను గవాను నింటికిఁబోయెను. అందెందుఁజూచినను గవానునియొక్క సద్గుణములను తెలుపు చిహ్నములే కన్పడెనుగాని యాతని దుర్గుణములకొక యాధారమును గన్పించలేదు. తానహమ్మదాబాదు పోయెను అచట గవానుని సౌధమంతయుఁ బరిశీలించెను. గవానుని యశోమూర్తి స్తంభముగాఁగట్టిన పూర్ణిమనాటి వెన్నెలవలె ధగధగలాడిపోయెను. మహమ్మదుషా దుఃఖముతోఁగొండపల్లికిఁ దిరిగివచ్చెను.

మహమ్మదుషా కూలిపోయెను. గవానుని యేస్మృతి కలిగినను స్త్రీవలె నేడువ మొదలుపెట్టెను. గవానుని శత్రువులు గవానుని చంపుటకుఁ జేసిన యీద్రోహము చివరకాతనికిఁ దెలిసెను. భీమరాజును దెచ్చిన యుద్యోగుల నందఱను బిలిపించెను. వారిని విమర్శించి యడిగెను. వారు చివరకు యదార్థము చెప్పివారిని క్షమింపవేడుకొనిరి. సుల్తాను దుఃఖాతిశయముచేత వారినిక్షమించెను. అతనిలోనున్న పూర్వపుఁ గాఠిన్యము కౄరత్వము పోయెను. హరశాస్త్రి గవాను మీది కుట్రలోఁ బ్రధానుఁడని సుల్తానునకుఁ దెలిసెను. హరశాస్త్రిని తీసికొని రండని భటులతోఁ జెప్పెను.

——



హరశాస్త్రి పాకు ప్రధానముగాఁ గుట్ర చేసినది తా నని తెలిసినదని యెరిగిన మరునాఁడు తల విరియఁబోసికొని, యుత్తరీయము లేకుండ, మొగమున నెల్లెడఁ గుంకుమ పూసికొని యొక కోకిబికి కఱ్ఱపుచ్చుకొని మహమ్మదుషా దర్శనమునకై కొండపల్లి కొండయెక్కి కోటలోనున్న సుల్తానుదగ్గఱకుఁ బరువెత్తుచు వెళ్ళెను. దారిలో నాతనిని చూచినవారెల్లరు హరశాస్త్రికిఁ బిచ్చియెత్తిన దనుకొనిరి. సుల్తాను కోటలో రాజభవనమున నొక యాసనముపై నాసీనుఁడై యుండెను. హరశాస్త్రి సుల్తానుముందు సాష్టాంగ పడెను. హరశాస్త్రి యట్లెన్నడును చేయఁడు. సుల్తానునకు దుఃఖాతిశోకము లేనియెడల హరశాస్త్రినిఁ జంపించెడి వాఁడే. కాని మహమ్మదుషా పూర్వము వానివలె లేఁడు. హరశాస్త్రికిఁ బిచ్చి యెత్తినదని సుల్తాననుకొనెను.

హరశాస్త్రి లేచి నిలఁబడి కొన్ని పిచ్చిచేష్టలు సేయుచు "సుల్తాన్! నేను బ్రాహ్మణుఁడను. కాఫరును. నీవు నన్నుఁ జంపించినచో నాకు బాధ లేదు. నాలోఁ బ్రాణము లేదు. అది పోను పోదు. నాకు మహమ్మదీయమత మిప్పించుము. అప్పుడు నన్నుఁ జంపుము నన్ను బాధపెట్టుము. అప్పుడు నాకుఁ బ్రాణము వచ్చును. నా ప్రాణమును నప్పుడు పోవును" అని

పకాలున నవ్వెను. సుల్తాను మనస్సు ఉత్సాహవ్యగ్రతం దాల్చెను. హరశాస్త్రి మాట లతనిని కత్తిపెట్టి పొడిచినట్లుగా నుండెను.

హరశాస్త్రి మరల నిట్లు ప్రారంభించెను. "సుల్తాన్! నేను సుల్తానును నా భార్యను నెవ్వడును కన్నెత్తిచూడరాదు. పంచభూతములలో గాలియు నగ్నియు నీరును గూడ నా భార్యను తాకరావు. వానికిం గూడ లింగత్వమున్నదేమో! సూర్యుని కిరణములు నా భార్యను తాకరావు వానికి పౌరుషభావములు తెలియునేమో! నాబీగము కోటగోడలలో వేనవేలు భటుల మధ్య సురక్షితయై యంతఃపురమున దూగుటుయ్యాల లూగుచుండును. నేను బలహీనులై సైన్యములు లేని వారి భార్యలను నా సైన్యములు పంపి తెప్పింతును. నేను సుల్తానును గదా! వారు నన్ను వరింప వలయును. వరింపక పోయినచోఁ గొరడాలతోఁ గొట్టించెదను. కాలుసేతులు కట్టి వారి పాతివ్రత్యము భంగము చేసెదను. నేను సుల్తానును గదా! నన్నుఁ గాదనువాఁడెవ్వఁడు. ఎవఁడైననున్నచో వాని నురి తీయింతును." అని చంకలు కొట్టుకొనెను.

సుల్తానునకుఁ గోపము వచ్చెను. కాని యా కోపము వెలికి రాలేదు. సుల్తా నూహింప మొదలుపెట్టెను. హరశాస్త్రి మరల నిట్లనెను "సుల్తాన్! నాకుఁ గొంచెము మతిభ్రమణ కలిగినట్లున్నది. దానికి నీవే కారణము. రాధ నాకూఁతురు. దానిని చెరచితివి. దానికిఅప్పుడు నేనూరకలేను.

దానిని దానిభర్త నిరాకరించెను. అదిపోయి కృష్ణలోఁ బడి చనిపోయినది. ఈపాప మెవరిది. నీది కాదా" సమాధానము చెప్పు మన్నట్లు హరశాస్త్రి సుల్తానువంకఁ జూచెను. సుల్తాను తల వంచుకొనెను.

హరశాస్త్రి మరల ననెను. "నా పూర్వుఁడు గంగూ బ్రాహ్మణుఁడు మీ పూర్వుఁడైన యల్లాఉద్దీన్ హసన్‌షాతో మైత్రి చేసి కొన్ని నిబంధన లేర్పఱచుకొనెను. దానితో మీ వంశమువారు బ్రాహ్మణులను జంపరాదు. నీవు నాతో నా నిబంధన చేసికొంటివి. కాని నా కనుల యెదుట నిరువదిమంది బ్రాహ్మణుల నీ కోటకు బలి పెట్టితివి నా కానాఁడే పిచ్చి యెక్క వలసినది. కాని నీయందు నాకు గల యభిమానము చేత నా పిచ్చి యిన్నాళ్ళవఱకు నాగినది. ఇప్పుడా పిచ్చి తల సూపినది." సుల్తాను హరశాస్త్రివంకఁ జూచెను.

హర—"బ్రాహ్మణులు మనుష్యులు కారా! వారికి సుఖదుఃఖములు లేవా! వారిలో నాత్మ యుండదా! మహమ్మదీయులకే యాత్మ కలదా! నవాబుల భార్యలుకాని స్త్రీలకుఁ బాతివ్రత్య మక్కరలేదా ! వారి కభిమానము లేదా! వారు పశువులా!" సుల్తాను తల వంచుకొనెను.

హర—"గవానుని చంపుటకుఁ గుట్ర చేసినవారిలోఁ బ్రధానుఁడను నేనని నీయూహ. అది నిజమే. నీవు కుఱ్ఱవాఁడవు. గవాను పండితుఁడు. అతని పాండిత్యకీర్తి దిక్కుల నిండినది. అతని దాతృత్వముచేత జనుల వాక్కులు పూచినవి. అతని మేధాశక్తిచేత బహమనీసామ్రాజ్యము ఫలించునది.

వయోవృద్ధుఁడు అట్టివానికి బ్రాహ్మణవధ సంతోష మీయ
వలయునా! నీవు తెలియక చేయుచున్న పని యతఁడు కా
దనరాదా! దయయు సత్యములేని పాండిత్య మెందులకు?
గవానునునీవుచంపించకపోయినచోఁజావఁడా!చిరస్థాయియా!
నేను చావనా! నీవిప్పుడు నన్నుఁజంపించినచోఁ జచ్చిపోదును.
కాదా! యేరోగమో వచ్చి మరికొన్నాళ్లకుఁ జత్తును.
నీ తండ్రి తాతలు చావలేదా! నీవుమాత్రము చావవా!
చావు జనుల కందఱకున్నది. ఒకరికి రోగమువలె నొకరికి
రాజు శిక్షవలె వచ్చును. తన యధికారములో లేని మృత్యు
వును తన యధికారమందున్నదనుకొని ప్రకృతిని దూషించు
టలో రాజు మూర్ఖుఁడు కదా!" సుల్తాను నిజమే యనుకొనెను.

హర—"సుల్తాన్ ! నన్నుఁ జంపింపవేమి? నీవు
నన్నుఁ జంపుదు ననియే వచ్చితిని. నా కెవ రున్నారు? మా
తల్లి చనిపోయినది. నా భార్య యిరువదియేండ్లక్రిందనే చని
పోయినది. నా పెంపుడుకూఁతును నీవు చంపితివి. నన్నుఁ
గూడఁ జంపుము. నీవు చంపకున్న నేను బ్రతుకునది లేదు.
నేనును నా కూఁతురు పడిన కృష్ణానదిలో పడెదను. కనుక నీవే
యా పుణ్యము కట్టుకొనుము" సుల్తాను మాటాడలేదు.
ఆతని తల తిరుగఁజొచ్చెను.

హర—'నా యూహప్రకారము మీ వంశము మా
వంశము నొక్కటిగా ముడిపెట్టుకొన్నవి. నాతో నా వంశ
మంతరించును. నీతో మీ రాజ్య మంతరించును. ఇది నా

శాపము. మా పూర్వుఁడైన గంగూబ్రాహ్మణుఁడు రాత్రి నాకుఁ గలలోఁ గన్పించి చెప్పెను.'

సుల్తానున కొడలుఁ దేళ్ళు ప్రాకినట్లయ్యెను.

హార—'ఓయి పిచ్చిసుల్తానా ! నీ కింకను పిచ్చియెత్త నందులకు నా కాశ్చర్యముగా నున్నది. గవానువంటి మహాను భావునిఁ జంపిన నీకుఁ బిచ్చి యెత్తవలయును. నీకుఁ బిచ్చి యెత్తినట్లును నాకు కలవచ్చినది. ఈ కలలో నేదో చిత్ర మున్నది.' సుల్తానునకు మనస్సులో నే భావమును నిలుచుట లేదు.

హార—'గవాను రాత్రి నాకుఁ గలలోఁ గన్పించెను. నన్నన్యాయము చేసితివనెను. నేను నీవు మహాపండితుఁ డవై యజ్ఞానివైన మహమ్మదీయునివలె నటించితివి. అందుచే నీయెడల నేను చేసినది తప్పుకాదంటిని. అతఁడు మారు మాటాడలేకపోయెను. చివరకు ఈ తప్పంతయు మహమ్మదు షాది. అతనికిఁ బిచ్చియెక్కినది. నేను వానికి నిజముగాఁ బిచ్చి పట్టించెదను' అనెను.

సుల్తానునకుఁ దనకుఁ బిచ్చి యెక్కుచున్నట్లనిపించెను.

హార—'సుల్తాన్! ఒకవేళ నీకుఁబిచ్చియెక్కదా! ప్రయ త్నముచేసి పిచ్చియెక్కించుకొనుము. అప్పుడు గవాను నెడల నీవు చేసినద్రోహమునకు సరియైనశిక్ష కలిగినట్లగును. ఎవరి తప్పునకు వారు శిక్ష యనుభవింపవలయును. గవాను చేసిన తప్పునకు గవాననుభవించెను. అంతటిమహాత్ముఁడైన గవాను

నకే శిక్ష తప్పునియెడల నీకును నాకునుదప్పునా! నాకు శిక్ష రానేవచ్చినది. ఇదిగో నా కున్మాదమెక్కినది. ఇంతటితో నాకీ శిక్షచాలును. నేటిరాత్రి కృష్ణానదిలోఁబడి చచ్చెదను. అదికాక నీవు చంపెదవా! చంపుము. ఇదిగో! నీ యెదుట నున్నాను. గవానును చంపినది నేను. నన్ను నీవు చంపుదువా! కృష్ణలోఁబడి చావుమందువా?' మహమ్మదుషా మాటాడ లేదు.

హార—'సరే! నీవు చంపకపోయినచోఁ గృష్ణలోఁబడి చచ్చెదను. కాని నీపాపమునకు నీకును శిక్షతప్పదు. కొందరికిశిక్ష చచ్చినతరువాత. మరికొందఱకు బ్రతికియున్నప్పుడు. నీకు బ్రతికియున్నప్పుడు. నీకుఁబిచ్చియెక్కును. అదిగోయెక్కుచున్నది. నేటిరాత్రికి నీవు కృష్ణయొడ్డున నిసుకమీఁదికి రా! అక్కడ నేను కృష్ణలోఁబడి మరణించుచుండగాఁ జూచెదవు కాక! నేను వెళ్ళుచున్నాను.'

హారశాస్త్రి వెడలిపోయెను. పోయినంత సేపు వికారపుఁ జేష్టలు చేయుచునే యుండెను. హారశాస్త్రి వెడలినంతనే మహమ్మదుషా తనగడ్డము పీకుకొనెను. తనదుస్తులన్నియుఁ దీసివేసెను. అతని కన్నులవెంట నీరు కారఁజొచ్చెను. అతఁ డేడ్వఁ దొడంగెను. అతఁడుకోటయంతయుఁ దిరుగఁ జొచ్చెను. దగ్గఱకు వచ్చినవానినెల్లఁ గత్తితోఁ జంపబోవును. అందుచే నెవరును సుల్తానునొద్దకుఁ బోవసాహసింపలేదు.

కోటలో గందరగోళ మెక్కువయ్యెను. రాణివాసము

సుఃఖింపఁజొచ్చెను. సైనికులు దిగులుపడిరి. మంత్రులు సేనానాయకులు దొట్రుపడిరి. గవానును చంపినందులకు యూసఫ్ ఆదిల్ ఖాను చాలమందిని సేనానాయకులను చీలదీసి పెద్ద సైన్యమును తనవెంటఁ దీసికొనిపోయి కొండపల్లికి దూరాన విడిసెను. అతఁడు తిరుగబడునో యేమిచేయునో తెలియరాదు.

మహమ్మదుషాహుఁ గొండపల్లికోటయందున్న వసహ్యానై పోయెను. అహమ్మదాబాదునకు కానాఁడే ముఖ్య చేరవలయునని యాజ్ఞయిచ్చి షా మరలఁ దాను కోటయంతయుఁ దిరుగ జొచ్చెను. ప్రొద్దుకుంకునపుడు షా తన సేనలతో నంతఃపురముతోఁ గొండపల్లి కోటవదలి కృష్ణయొద్దకుఁ బోయివిడిసెను. మరునాఁడు అహమ్మదాబాదునకుఁ బోవలయునని షాయూహ.

మహమ్మదుషాహుఁ దన సేనానాయకులు చీలిపోవుటకు యమయ్యెను. షా వారికి దన్నుఁ గలసికొమ్మని కబురంపెను. రు 'నిన్ను నమ్మరాదు. గవాను వంటివానినే చంపించితివి. మమ్ము బ్రతుకనీవు మేమురా'మనరి. షా యున్మాదము వివృద్ధిగాంచెను.

ఆనాఁడు ప్రొద్దుకుంకెను. చీకట్లు క్రమ్ముకొని వచ్చెను. షా యెవ్వరు చూడకుండ తన గుడారము వదలి కృష్ణయిసుకమీద శిబిరమునకు దూరముగాఁబోయి పిచ్చివానివలెఁ దిరుగఁజొచ్చెను.

## ఇరువదియవ ప్రకరణము

మహమ్మదుషా కృష్ణనీటివెంటఁ జాలదూరము పోయెను.

ఒకచోట నీటిపాము ఇసుకమీఁదఁ బండుకొనియుండెను. అది యతని యడుగులు తాకి జరజర నీటిలోనికిఁ బోయెను. చాలఁ గప్పలతని కాళ్ళక్రింద నలిగెను. మరికొంతదూరము పోయినతరువాతఁ బ్రవాహముగల నీటియొద్దకుఁ బోగాఁ బాములుగాని కప్పలుగాని తాకవాయెను. ఒక తీతువు కూయుచుఁ బ్రవాహముమీఁదఁ బోవుచుండెను. పాముఁ గొంతదూరములో నొకవ్యక్తి నడచుచున్నట్లు గోచరించెను. నెమ్మదిగా నతఁడా వ్యక్తియొద్దకుఁబోయెను. అది స్త్రీమూర్తి. చింపిరిజుట్టు. భయంకరములైన గ్రుడ్లు. మహమ్మదుసాకుఁ బిశాచములన్న భయములేదు. అయినను అతనికిఁ గొంచెమా నాఁడు భయము వేసెను. మహమ్మదుసా 'ఎవరవు నీ' వనియడిగెను.

ఆవ్యక్తి యతనికంఠస్వరము నానవాలు పట్టెను. ఆమె 'నాపేరు రాధ' యన్నది. మహమ్మదుసా యిలువెళ్ల నడచి పోయెను.

రాధ యిన్నాళ్ళుగా శూద్రస్త్రీవలె వెలిభోజనము నెరపెను. ప్రోషితభర్తృకవలె భూశయనము, నిరలంకారతయుఁ బాటించెను. దుఃఖితవలె మౌనధారిణి యయ్యెను. నియమము తాల్చినదానివలె బ్రాహ్మణాన్నమే తినెను. ఆమె హరశాస్త్రియొక్క ఒక చిన్నిర 'పేష్కుప్పు' తీసికొని యది సర్వకాలము ధరించుచుండెను. అమరావతిలో దురాత్ముని ప్రవర్తన తరువాత రాధ తనశీలము తాను రక్షించుకొనవలె ననుకొన్నది. ఈ యూహ యామెదురవస్థకుఁ బూర్వమే

మభినయము. అది పాకుఁ బిచ్చిపుట్టించుటకుఁ జేసినతంత్రము
పాను కృష్ణ యిసుక మీఁది కానాఁడు పంపుమని రాధ
శాస్త్రితోఁ జెప్పెను. తన చేతులార రాధ పాను చం
వలెననుకొన్నది. మరునాఁడుపా బ్రతికినవార్తయు, రాధచచ్చి
వార్తయు, హరశాస్త్రికిఁ దెలిసెను. హరశాస్త్రి చివరివే
రాధకు వైరాగ్యము తోఁచెననుకొనలేదు. ఆమెకు సరిగా
గత్తితోఁ బొడుచుట చేతకాలే దనుకొనెను. హరశాస్త్రి
యంతటితో వైరాగ్యము కలిగి సన్యసించి కాశీపురికి
బోయెను.

గాయము కుదురు రోజులలో పాకు నొక స్వప్నము
వచ్చెను. అందులో నిట్లున్నది. "హరశాస్త్రి శాపములకు
గంగూబ్రాహ్మణుని యాత్మ తనవంశమును దహింపఁజొచ్చెను.
తన రాజ్యము ముక్కలు ముక్కలై పోయెను. సేనానాయకు
లందరుఁ దిరుగఁబడిరి. తాను నికృష్టపుచావు చచ్చెను. తన
కొడుకు సుల్తానయ్యెను. తన కొడుకు చిన్నవాఁడగుటచేత
గాసింబరీదు నతని కొడుకు అమీరుబరీదు వానిని చం
రాజ్యము నపహరించిరి. బహ్మనీరాజుల వంశ మంతట
నంతరించెను. దక్షిణ హిందూదేశములోని తన రాజ్యము
నాలుగు చెక్కలుగాఁ నయిపోయెను. గంగూబ్రాహ్మ
ణుని యాత్మ దయ్యమువలెఁబట్టితనవంశముమీఁదఁగూర్చు
డెను." భయముతో పా మేల్కనెను.

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B150 |
| పుస్తకం పేరు | వక్రరేఖ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 149 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | narma |
| పేజీలు విడదీసినది | narma |
| | Haseena |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | no |
| పరిస్థితి | good |